శ్రీ

# భక్తమణిభూషణము.




గ్రంథకర్త

## ఆదిపూడి సోమనాథరావు.

9. ముద్దుకృష్ణ మొదలివీధి, మైలాపూరు, మదరాసు



రెండవకూర్పు, 1000 ప్రతులు.

వెల రు 2-0-0.

మదరాసు.

కేసరి ముద్రాక్షరశాలయందు ముద్రితము.

1927

# విన్నపము.

ఇటీవల నేను బహువాత పీడితుఁడ నగుటచే ప్రూఫు లను జూచుటకుఁ దగినంత యోపిక లేకపోయెను. గానఁ గొన్ని యచ్చు తప్పు లీ పునర్ముద్రణమందు దొర్లినవి. చదు వరులు మన్నింతురుగాక. ఇందలి గాంధీ దయానంద వివేకా నంద రామమోహనుల చిత్ర పటముల నచ్చొత్తించి యుచి తముగా దయచేసిన దేశోద్ధారకులగు శ్రీ కా॥ నాగేశ్వర రావు పంతులుగారికి నే నెంతయుఁ గృతజ్ఞుఁడను. పరమేశ్వ రుని కృపాతిశయముచే భాషాభిమానులు, భక్తులు, ధనవం తులు నగు నాంధ్రసోదరులు నా యీగ్రంథ రాజమునకుఁ దగినంత ప్రోత్సాహ మిత్తురని తలంచెద. వారిచిత్తము నా భాగ్యము.

ఆదిపూడి. సోమనాథరావు.

ఓమ్

# అంకితము



సీ. పరమేశునాజ్ఞల ♦ భక్తినా దలఁదాల్చి
పాలించుచుండెడు ♦ భక్తులార!
ప్రాణిమాత్రమునకు ♦ భద్రమ్ముఁగొల్పెడు
పనిఁబూనియుండు కృ ♦ పాళులార!
న్యాయసత్యములతో ♦ నలరారుచుండెడు
పూతభావంబొప్పు ♦ పూజ్యులార!
ప్రేమసూత్రముచేతఁ ♦ బృథ్వినిబంధించి
యానందపడెడు మ ♦ హాత్ములార!

గీ. భక్తమణిభూషణంబను ♦ భవ్యకృతిని
దీనినాకాన్కగామీకుఁ ♦ దెల్చినాఁడ
స్వీకరింపుఁడు పరమ ప ♦ విత్రులార!
మిత్రవరులార ఈశ్వర ♦ పుత్త్రులార!

ఆదిపూడి సోమనాథరావు



# ధర్మము

నన్నునమ్మెడువారలు ♦ న్నారుగాన
ననృతమునువీడి సత్యమ్మె ♦ యాడుచుండు;
నన్ననుసరించువారలు ♦ న్నారుగాన
విమలతరవర్తనంబున ♦ వెలయుచుండు;
పడవలసియుండు నెన్నియో ♦ పాట్లుగాన
దగినయుత్కృష్ట బలమును ♦ దాల్చియుండు;
కడఁగిపోరాడు తరుణముల్ ♦ గలవుగాన
ధైర్యశౌర్యమ్ములనుగల్గి ♦ తనరుచుండు;
వైరులకు దిక్కులేనట్టి ♦ వారలకును
నందఱకుమిత్రుఁడై భువి ♦ నలరుచుండు;
ఇత్తునేకాని యిచ్చిన ♦ దెంచకుండు;
ఎల్ల నాలోపములునాకు ♦ నెఱుకగాన
వినయగుణమును నెప్పుడు ♦ విడువకుండు;
ప్రభునిపై జ్ఞానదృష్టిని ♦ బఱపుచుండు;
నెవ్వగలమాని చిఱునవ్వు ♦ నవ్వుచుండు;
ఎందును నిరాశఁజెందినేఁ ♦ గుందకుండు;
ఇలఁబతితులైనవారల ♦ నెత్తుచుండు;
ఎల్లప్రాణులనరసి ప్రే ♦ మించుచుండు;
ఇదియె నాధర్మమని మది ♦ నెంచుచుండు.

శ్రీ

# సర్వమాన్యశతకము.



సీ. శ్రీకరుణాసుధా ♦ సింధువై లోకైక
బంధువై పొల్చునీ ♦ బాంధవమును
నిఖిలభూతగణైక ♦ నేతవై విబుధ సం
త్రాతవై యలరు నీ ♦ ప్రాభవమును
రమణీయభువన ని ♦ ర్మాయివై సంతోష
దాయివై తనరు నీ ♦ సోయగమును
ధార్మికోత్సాహ సం ♦ ధాతవై ఋషులకు
నూఁతవై యొప్పు నీ ♦ యొప్పిదమును

గీ. దలఁచిదర్శించు వేడ్కఁ జి ♦ త్తమునఁ బొదల
శతకమును గాన్కఁ గాఁ గొని ♦ సంభ్రమమునఁ
గొల్వవచ్చితిఁ జూపు నీ ♦ చెల్వు తండ్రి!
సకలకల్యాణగుణధన్య! ♦ సర్వమాన్య!



## సర్వమాన్యశతకము.

సీ. వీనులవిందుగా ♦ వించుగానమునందు
దృష్టిపర్వమొనర్చు ♦ సృష్టియందు
రసనోత్సవముసేయు ♦ నసమానరుచియందు
హితమగు మందమా ♦ రుతమునందు
నాసికానంద సు ♦ వాసనావళియందు
మహిమచే నొప్పు స ♦ న్మనమునందు
వివిధసాంసారిక ♦ విషయసౌఖ్యములందు
విద్యావినోదాది ♦ విధులయందు

గీ. నిన్ను నవ్యయు నిఖిలాత్ము ♦ నిర్వికారుఁ
బ్రేమసాగరు యోగీంద్ర ♦ హృద్విహారుఁ
జూచి సంతోషభరమునఁ ♦ జొక్కు టెపుడు?
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య!

సీ. నిగనిగమనిమించు ♦ నీరజారినిగాని
ధగధగ వెలిఁగెడు ♦ తరణిఁగాని
ప్రాఁకులఁగదలించు ♦ మారుతమ్మునుగాని
యడవులఁగాల్చెడు ♦ నగ్నిఁగాని
ధారగాఁగురిసెడు ♦ ధారాధరముఁగాని
యలలచేనుప్పొంగు ♦ జలధిఁగాని
జలజలఁబ్రవహించు ♦ సెలయేఱులనుగాని
తిరముగాఁబొల్చెడు ♦ గిరులఁగాని

గీ. కాంచినపుడెల్లవానిలో ♦ మించునిన్ను
మనములోఁజూచి యానంద ♦ మగ్నుఁడగుచు
వెలయుభాగ్యంబునాకు ల ♦ భించు టెపుడు?
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య!

# సర్వమాన్యశతకము.

సీ.. లోకజాలము నెల్ల ♦ వీఁకమైఁ దాల్చుచుఁ
బ్రబలమై మించు నీ ♦ బలమె బలము
అఖిలాండముల నెల్ల ♦ నద్భుతంబుగఁ జేయు
నేర్పరివైన నీ ♦ నేర్పె నేర్పు
పరమాణువాదిగా ♦ బ్రహ్మాండములయందు
నిండియుండెడు నీదు ♦ నింపె నింపు
కోటిసూర్యులునైన ♦ సాటిసేయఁగ లేని
దేదీప్యమానీదు ♦ తేజె తేజు
గీ. పారమే లేని నీదయా ♦ వార్ధి వార్ధి
పాపదావాగ్నిలోఁబడి ♦ భస్మమైన
మమ్ముఁ బునరుద్ధరించు నీ ♦ మహిమ మహిమ
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య!

సీ. భీష్మప్రతాపుఁడౌ ♦ గ్రీష్మభానుండైన
మిడుఁగుఱునీ పేర్మి ♦ కడఁక ముందుఁ
బదియాఱుకళలచేఁ ♦ బొదలుచంద్రుండైన
నద్దంపుముక్క నీ ♦ యశము ముందుఁ
బ్రావృడాగమమందుఁ ♦ బ్రవహించు నదులెల్లఁ
దుంపరల్ నీదయా ♦ ధునికిముందు
నేము వాసముచేయు ♦ నీలోకమంతయు
నలుసుగా! నీలోక ♦ ములకుముందు
గీ. నహహా! నీమహిమాదుల ♦ నభినుతింప
నధములకు మాకుఁదరమౌనె ♦ యఖిలయోగి
మండలికిఁగూడ నలవిగా ♦ కుండునపుడు
సకలకల్యాణగుణధన్య! ♦ సర్వమాన్య!

సీ. నీమహామహిమచే ♦ నిఖిలబ్రహ్మాండముల్
దివివిమానములట్లు ♦ తేలుచుండు
నీమహాశక్తిచే ♦ నెఱిబొంగరమ్ముల
తీరున గిర గిరఁ ♦ దిరుగుచుండు
నీమహాశాసన ♦ నియతిచే నొండొంటిఁ
దాఁకకతమదారిఁ ♦ దరలుచుండు
నీమహాదీప్తిచే ♦ నిండురసంపు గుం
డులమాడ్కి నిగనిగ ♦ వెలుఁగుచుండు
గీ. నహహ! నీమహిమాదుల ♦ యద్భుతంబు
దలఁచినంతన దేహంబు ♦ పులకరించి
కనులనానందబాష్పముల్ ♦ గ్రమ్మికురియు
సకలకల్యాణగుణధన్య! ♦ సర్వమాన్య! 6

సీ. ఏకడఁజూచిన ♦ నాకడనుండి నీ
కరుణాప్రవర్షంబె ♦ కురియుచుండు
నేవంకఁజూచిన ♦ నావంకనుండి నీ
వేదనినాదంబె ♦ వెడలుచుండు
నేజాడఁజూచిన ♦ నాజాడనుండి నీ
తేజోవిలాసంబె ♦ తెరలుచుండు
నేచాయఁజూచిన ♦ నాచాయనుండి నీ
ఖ్యాతిసుగంధమ్మె ♦ క్రమ్ముచుండు
నెచటఁజూచిన నచ్చట ♦ నింపునింపు
నీప్రభావంపు నిగనిగల్ ♦ నిర్వికార!
దినమందార! భక్తసు ♦ ధీవిహార!
సకలకల్యాణగుణధన్య! ♦ సర్వమాన్య!

## సర్వమాన్యశతకము.

త్రిభువనసౌందర్య ♦ విభవంబులో నెల్ల
శృంగారరసమె యు ♦ ప్పొంగుచుండు
ఋతుపరంపరల యా ♦ యతమందు వీక్షింప
వీరమచ్చట వెల్లి ♦ విరియుచుండు
సకలజీవావన ♦ సత్కార్య సరణిలోఁ
పలఁ గరుణారసం ♦ బొలుకుచుండు
స్థూలమహాస్థూల ♦ సూక్ష్మాతిసూక్ష్మంబు
లందునద్భుతమే తో ♦ ల్కాడుచుండు
సర్వరసములు నంతటఁ ♦ బర్వియుండుఁ
జూచుటకుబుద్ధిలోపల ♦ సూక్ష్మదృష్టి
కలుగవలెఁగాని నీకటా ♦ క్షంబుచేత
సకలకల్యాణగుణధన్య! ♦ సర్వమాన్య!

భువిధ్రువమండలం ♦ బునదృష్టిసారింప
వింతలెంతయుఁగను ♦ విందుసేయు
నాఱునెలల్పగ ♦ లాఱునెలల్ రాత్రి
యగుచుండుఁదఱచుగా ♦ నంబరమున
బంగారువింటికి ♦ రంగురంగులపట్టు
తెరలు వ్రేలాడెడు ♦ తెఱఁగుదోఁప
విద్యుత్తరంగాళి ♦ వివిధప్రభలచేతఁ
జిత్రాకృతులఁదాల్చి ♦ చెలఁగుచుండు
సర్వవస్తు ప్రదర్శన ♦ శాలయైన
సృష్టిలోపలనేమేమి ♦ చిత్రములను
గూర్చినాఁడవో తెలియంగ ♦ నేర్చువాఁడు
సకలకల్యాణగుణధన్య! ♦ సర్వమాన్య!

సీ. నిరుపమసౌందర్య ♦ నిలయమీ భువనంబు
భవదీయవరసభా ♦ భవనమయ్యా
ఇందువెలుంగు సూ ♦ ర్యేందులు మహనీయ
భాసమానములు దీ ♦ పంబులయ్యా
పవమానుఁడెప్పుడు ♦ పట్టినవీవనల్
విడువక వీచెడు ♦ భృత్యుఁడయ్యా
కోకిలాముఖపక్షి ♦ కూజితమ్ములు సుధా
మాధురీగాన వి ♦ నోదమయ్యా
గీ. వందిమాగధపాఠక ♦ వాంశికాదు
లరయ నీభక్తులనుట స ♦ త్యార్థమయ్యా
ప్రభువు నీవయ్యా మేము నీ ♦ ప్రజలమయ్యా
సకలకల్యాణగుణధన్య! ♦ సర్వమాన్య! 10

సీ. లోకజాలములెల్ల ♦ నీకుక్షిలోపల
నొకమూలనవలీల ♦ నొదిగియుండు
నణువణువందున ♦ నత్యద్భుతంబుగా
నీకనుల్ నీచెవుల్ ♦ నిండియుండు
నిఖిలాండములయందు ♦ నిండిన నీరూపు
నెలమిభక్తునిమది ♦ నిమిడియుండు
నంతటనీవ్యాప్తి ♦ యలరుచునుండియు
నజ్ఞానికనులకు ♦ నందకుండుఁ
గీ. చిత్రచారిత్రుఁడవునీవు ♦ చిత్ప్రభూత!
రూపరసగంధనిర్మాత! ♦ రూపరహిత!
మాతలకునెల్లనీవె ప్ర ♦ ఖ్యాతమాత!
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య! 11

# సర్వమాన్యశతకము.

సీ. దివి వెల్గునక్షత్ర ♦ దీపమాలికలచే
నీజయోత్సవమును ♦ నిశలుసల్పఁ
బూర్వాద్రిపైనుండి ♦ బోరునఁ జాటునీ
చండశాసనము సూ ♦ ర్యుండు దినము
నీయశోమృతమును ♦ నించిచందురులోన
నిలువక కాలమ్ము ♦ కొలుచుచుండు
నిర్నిద్రమైభూత ♦ నిచయంబు నిరతంబుఁ
బ్రకటించుచుండు నీ ♦ ప్రాభవంబు

గీ. విశ్వమంతయు నీసేవ ♦ విరతిలేక
యిట్లుసలుపుచునుండియు ♦ నెఱుఁగకుండుఁ
దెలిసినినుభక్తుఁడొక్కఁడే ♦ కొలుచుచుండు
సకలకల్యాణగుణధన్య! ♦ సర్వమాన్య!

సీ. గర్భమ్మునందాల్చి ♦ కనిపెంచికాపాడు
తల్లినిచ్చెడు నట్టి ♦ తల్లివీవు
తల్లిని బిల్లలఁ ♦ దద్దయుఁబోషించు
తండ్రినొసంగెడు ♦ తండ్రివీవు
తల్లులఁబిల్లలఁ ♦ దండ్రులరక్షించు
ప్రభువుఁ బ్రసాదించు ♦ ప్రభుఁడవీవు
వీరలందఱిలోన ♦ పీడని యన్యోన్య
మునుగూర్చునట్టి యా ♦ ప్తుండవీవు

గీ. అజ్ఞులనుదజ్ఞులుగఁజేయు ♦ ప్రాజ్ఞుఁడీవు
భక్తిచే మమ్ముబంధించు ♦ బంధువీవు
వావివరుసలఁజిక్కని ♦ వాఁడవీవు
సకలకల్యాణగుణధన్య! ♦ సర్వమాన్య!

సీ. హృదయాంబు జాతంబు ♦ పొదలింపఁ గాన్పించి
ప్రభలనీనెడుచిత్ర ♦ భానుఁడీవు
మానస మానస ♦ మండనంబుగఁ దేలి
యాడుచుండెడు రాజ ♦ హంసమీవు
చిత్తసింహాసనం ♦ బుత్తమోత్తమముగా
వింపనారోహించు ♦ విభుఁడవీవు
స్వాంతతాపమ్ములు ♦ సాంతమ్ము శాంతింపఁ
గరుణ వేవర్షించు ♦ ఘనుఁడవీవు
గీ. నామనోరథరథమును ♦ నడుపునట్టి
సారథివినీవు సర్వసం ♦ సారమునకు
సారమేగాక భక్తాను ♦ సారివీవు
సకలకల్యాణగుణధన్య! ♦ సర్వమాన్య!

సీ. కరుణాత్ములకు నీవు ♦ కరుణాస్వరూపివై
క్రూరులకును మహా ♦ క్రూరుఁడగుచు
న్యాయవాదులకీవు ♦ న్యాయస్వరూపివై
యన్యాయపరులకు ♦ యముఁడవగుచు
నీతిమంతులకీవు ♦ నిర్మలమూర్తివై
దుర్నీతిపరులకు ♦ దూరుఁడగుచు
ధర్మాత్ములకు నెల్ల ♦ ధర్మస్వరూపివై
ధర్మహీనులకు ని ♦ ర్దయుఁడవగుచు
గీ. దుఃఖములచేతఁ దూలించి ♦ దోషములను
దుష్టులను శిష్టులుగమార్చి ♦ శిష్టవరుల
రక్షణముచేయుచున్నావు ♦ రక్తి మీఱ
సకలకల్యాణగుణధన్య! ♦ సర్వమాన్య!

# సర్వమాన్యశతకము.

సీ. విలతగాస్వాంతముల్ ♦ వీక్షించునీవెపో
వేయికన్నులవాఁడు ♦ విశ్వవేద్య!
పాపాటవులనెల్ల ♦ భస్మంబుచేసెడు
నీవెపో కాలాగ్ని ♦ నిష్కళంక!
సంతాపములనెల్లఁ ♦ జల్లార్చు నీవెపో
పర్జన్యమూర్తివి ♦ పరమపురుష!
భక్తిఁజిత్తంబులఁ ♦ బ్రజ్వరిల్లగఁజేయు
నీవెపోయనిలంబు ♦ దేవదేవ!

గీ. నీస్వరూపంబులోపల ♦ నిఖిలమైన
భూతగణముల గుణములు ♦ పొల్చుచుండు
నన్నిటికి నీవెయాధార ♦ మగుటఁదండ్రి!
సకలకల్యాణగుణధన్య! ♦ సర్వమాన్య!

సీ. మతిగ్రహింపఁగలేని ♦ యతివేగమునఁదమ
గతులుదప్పకపాఱు ♦ గ్రహములట్లు
పొర్లకవడిఁబాఱు ♦ పొగబండ్ల నిర్మించు
శక్తినిచ్చినది నీ ♦ శక్తికాదె?
కుంధకడిందక ♦ కొల్లగాభూమిపైఁ
గాంతులఁజిమ్ము భా ♦ స్కరునికరణి
వెలుఁగువిద్యుద్దీప ♦ ములవెలిఁగించెడు
మహిమఁగొల్పినదినీ ♦ మహిమగాదె?

గీ. సకలమునునీవు సృజియించు ♦ సరణిదోఁప
యంత్రమునెల్ల నొనరించు ♦ నట్టిబుద్ధిఁ
బుడమిఁబొడమించినది భవ ♦ ద్బుద్ధికాదె?
సకలకల్యాణగుణధన్య! ♦ సర్వమాన్య!

సీ. అఖిలభూతములపై ♦ నాజ్ఞ చెల్లించెడు
శక్తికల్గుట దేని ♦ శక్తివలన
నడవిమెకంబుల ♦ నతిసాధువులఁ జేయు
యుక్తికల్గుట దేని ♦ యుక్తివలనఁ
బినజాతివారలు ♦ పెనుజాతివారిపై
బలముఁ జూపుట దేని ♦ బలమువలనఁ
జిక్కనినినుఁబట్టి ♦ చిత్తంబులోఁ గట్టు
మహిమ గల్గుట దేని ♦ మహిమవలన
గీ. నట్టిపరమాద్భుతంబైన ♦ యమలబుద్ధిఁ
గరుణనీవు ప్రసాదించు ♦ కతనఁగాదె
యల్పులయ్యును నరులిల ♦ నధికులౌట?
సకలకల్యాణగుణధన్య ! ♦ సర్వమాన్య! 18
సీ. అత్యద్భుతంబులౌ ♦ నఖిలబ్రహ్మాండముల్
జీవాణుకోట్లని ♦ చెప్పువారు
విశ్వమంతయు మహా ♦ విద్యుత్తరంగాళి
విలసనంబనినొక్కి ♦ తెలుపువారు
లోకజాలములెల్ల ♦ నేకరసంబైన
ప్రకృతిజాలంబని ♦ పలుకువారు
పరమాణువతిసూక్ష్మ ♦ తరమైన యొకవింత
గ్రహమండలంబని ♦ కలుపువారు
గీ. అప్రమేయుండవగు నిన్ను ♦ నరయనెంచి
ప్రబలమౌబుద్ధి బలమునఁ ♦ బరుగులెత్తి
యలసినిలిచిన వారలో ♦ యనుఁగుఁదండ్రి !
సకలకల్యాణ గుణధన్య ! ♦ సర్వమాన్య! 19

సీ. భవదీయమహిమంబు ♦ ప్రకృతిసౌందర్యంబు
నందుఁగొందఱుగాంచి ♦ యలరుచుంద్రు
కొందఱుహృదయార ♦ విందమ్ములోనినుఁ
గనిహర్షమగ్నులై ♦ క్రాలుచుంద్రు
తమజీవితమ్ములోన ♦ దర్శించినినుఁగొంద
ఱానందపరవశు ♦ లగుచునుంద్రు
వివిధమానుషజాతి ♦ వృత్తమ్ములనునినుఁ
బొడగాంచి కొందఱు ♦ పొంగుచుంద్రు
గీ. సర్వమున నిన్నుఁగనుఁగొని ♦ సంభ్రమమున
నద్భుతంబుగనీయాజ్ఞ ♦ లనవరతము
సలుపుచుందురుకొందఱు ♦ జగతిలోన
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య! 20
సీ. ఇచ్చిన దెంచక ♦ యియ్యనిదానికై
నిందించువారలు ♦ కొందఱుంద్రు
ఇచ్చిన దెంచుచు ♦ నియ్యనిదానికై
కోపించువారలు ♦ కొందఱుంద్రు
ఇచ్చినదానికే ♦ యెంతయు నుప్పొంగి
కొనియాడువారలు ♦ కొందఱుంద్రు
ఇచ్చిన నేమి నీ ♦ వియ్యకుండిన నేమి
కూర్మినిఁ గొల్చుచుఁ ♦ గొందఱుంద్రు
గీ. అందఱకు నెల్లవిధముల ♦ నాప్తుఁడగుచు
నిచ్చుచుందువు మితమును ♦ హితము నెఱిఁగి
నీవెమాకెన్న నిజమైన ♦ స్నేహితుఁడవు
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య! 21

సీ. ఎవరెఱుంగఁగరాని ♦ యేకాంతముననుండి
యెంతయునెలమి వీ ♦ క్షింతువనుచు
వీక్షించి దుష్టుని ♦ విపరీతచర్యల
కెంతయుఁగనలి శి ♦ క్షింతువనుచు
శిక్షించి పరిశుద్ధ ♦ చిత్తునిగాఁజేసి
వింతగామఱి పరీ ♦ క్షింతువనుచు
నాపరీక్షను దేఱ ♦ నచల భక్తికిమెచ్చి
చింతలఁదీర్చి ర ♦ క్షింతువనుచు
గీ. రక్షణము సేసిమోక్షసా ♦ మ్రాజ్యమునకుఁ
బట్టభద్రు నొనర్చెదే ♦ పట్టుదనుచుఁ
బలుకుచుందురు నినుఁగన్న ♦ భక్తవరులు
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య! 22
సీ. భూరిసారమ్ములఁ ♦ బొల్చుప్రోవులుగాని
కొండలు గుండ్రుల ♦ పిండుగాదు
జీవనాధారమై ♦ చెల్లుధారలుగాని
వృష్టి శీకరముల ♦ వితతిగాదు
ప్రాణిసంత్రాణైక ♦ ప్రబలతేజముగాని
రవికిరణమ్ముల ♦ రాజిగాదు
భవదీయశక్తి ప్ర ♦ భాపుంజములుగాని
బ్రహ్మాండములు భూత ♦ పాళిగాదు
గీ. హృదయమిది నిన్నువీక్షింప ♦ నిచ్ఛయించు
జ్ఞానులకు సూక్ష్మదర్శినీ ♦ నామయంత్ర
రాజమేకాని మాంసంపు ♦ రాశిగాదు
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య! 23

# సర్వమాన్యశతకము.

సీ. రాళ్లలోపల గొప్ప ♦ రత్నమ్ములను బెట్టి
ముళ్లలోన గులాబి ♦ పువ్వుఁ బెట్టి
యుగ్రాటవులలోన ♦ నోషధులను బెట్టి
యంబుధిలోనము ♦ త్యములఁ బెట్టి
బలుచిక్కు కప్పలో ♦ పలఁ గొబ్బెరను బెట్టి
కష్టమ్ములోన సు ♦ ఖమ్ముఁ బెట్టి
యురుమరుభూమిలో ♦ నుదకస్థలిని బెట్టి
విషములో నమృతమ్ము ♦ వింతఁ బెట్టి

గీ. కొనకు పరమాణువులవట్టి ♦ కుప్పయైన
యీశరీరంబులోపల ♦ నెలమి నిన్ను
వీక్షణము సేయు సచ్ఛక్తిఁ ♦ బెట్టినావు
సకలకల్యాణ గుణధన్య! సర్వమాన్య!

సీ. దృష్టిసారించినీ ♦ సృష్టిచిత్రమ్ములఁ
గాంచిమెచ్చని యట్టి ♦ కనుల వేల?
విశ్వమంతటనుండి ♦ వీ తెంచు వేదముల్
వినిసంతసింపని ♦ వీను లేల?
నిర్మలమైనట్టి ♦ నీగుణరాజిని
వర్ణించిపాడని ♦ వక్త్రమేల?
దీనులయాపదల్ ♦ దీర్పవెచ్చింపని
విరివిగాఁగూర్చిన ♦ సిరుల వేల?

గీ. పరమసౌజన్యనిధివైన ♦ పరమపురుష!
నీవొసంగిన వన్నియు ♦ నీదునాజ్ఞ
జరపఁగానీనియానీచు ♦ జన్మమేల?
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య!

సీ. అఖిలాండములనిండి ♦ యలరుచుండెడునీకు
నాలయంబునుగట్టఁ ♦ జాలు నెవఁడు?
గణనకుమిాఱిన ♦ గుణములుగలనీకు
సరియైన పేర్వెట్టఁ ♦ జాలు నెవఁడు?
ఆద్యంతములు లేని ♦ యప్రమేయుని నిన్ను
సాంతంబుగాఁజూడఁ ♦ జాలు నెవఁడు?
ఆత్మకునాత్మవై ♦ యతిసూక్ష్మవస్తువై
క్రాలునిన్ బట్టంగఁ ♦ జాలు నెవఁడు?
గీ. పరమయోగీంద్ర మానస ♦ పద్మములను
వేవెలుంగుల వెలిఁగించు ♦ విభుని నిన్ను
సర్వశక్తుని వర్ణింపఁ ♦ జాలు నెవఁడు?
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య!

సీ. విశ్వేశ్వరుండవై ♦ వెలయునీవువసించు
నఖిలాండములు వార ♦ ణాసిమాకుఁ
బతితపావన కార్య ♦ బద్ధమానీదయా
వాహినిగంగాభ ♦ వానిమాకుఁ
జాంచల్యరహితమై ♦ సద్భక్తిఁబొల్చునీ
గూర్చుచిత్తమెపంచ ♦ క్రోశిమాకుఁ
ప్రాణిమాత్రమునకు ♦ భద్రమేకోరుచుఁ
గావించుపనులు నీ ♦ సేవమాకు
గీ. మూఢవిశ్వాసములఁ గట్టి ♦ మూలఁబెట్టి
నిన్ను నిరతంబు హృదయసా ♦ న్నిధ్యమందు
మోదమునఁజూచి పొంగుటే ♦ ముక్తిమాకు
సకలకల్యాణగుణధన్య! ♦ సర్వమాన్య!

సీ. బీదయౌ వడ్రంగి ♦ బిడ్డనినామంబు
చక్రవర్తులకుసం ♦ స్తవ్యమయ్యె (క్రీస్తు.)
నాకమూల నొదిగిన ♦ యొకకొన్ని దీవులు
రవియ స్తమింపని ♦ రాజ్యమయ్యె (ఆంగ్లరాజ్యము.)
మొనమొన్న వఱకుఁ దూ ♦ ర్పున బేరు లేనిది
హెచ్చి పేర్చినదాని ♦ మచ్చమాపె (జపాను.)
నెన్నిక యే లేని ♦ సన్ననియొకయేఱు
పెనుబట్టణము మ్రింగి ♦ పేరుఁగాంచె (మూసానది.)
గీ. నీదయాపూరమెద్దాని ♦ మీఁదఁ బాఱుఁ
జిన్నదయ్యును నదిచాలఁ ♦ జెన్నుమీఱు
నెన్న నాకీర్తి యంతయు ♦ నిన్నె చేరు
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య! 28
సీ. నీకటాక్షము జాఱ ♦ నిముసంబులోపల
బ్రహ్మాండములు భస్మ ♦ రాసులౌను
నీకటాక్షముఁ జేర ♦ నిమిషార్ధమున భస్మ
రాసులు బ్రహ్మాండ ♦ రాసులౌను
నీవు చేవీడిన ♦ నిర్జరేంద్రుండైన
క్షణములోపలఁ గ్రింద ♦ జాఱిపడును
నీవుచేఁబట్టిన ♦ నీచుఁడైనను దత్క్ష-
ణంబున సామ్రాజ్య ♦ నాథుఁడౌను
గీ. నిగ్రహానుగ్రహంబుల ♦ నిరుపమాన
శక్తియుక్తుండవగుటను ♦ సర్వశక్తి
మంతుఁడందురు నిన్ను స ♦ మస్తజనులు
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య! 29

సీ. కన్నులారా! మీరు ♦ కరుణాస్వరూపునిఁ
గనుఁగొన సాయంబు ♦ గండు రండు
వీనులారా! మీరు ♦ విభునిశాసనముల
నెలమినాలింపంగ ♦ నిండు లెండు
చేతులారా! మీరు ♦ చిత్తాబ్జమిత్రునిఁ
దవిలిసేవింప సి ♦ ద్ధంబుగండు
హృదయమా! నాథుఁడు ♦ ముదముతోనీలోనఁ
గనఁబడనున్నాఁడు ♦ గదలకుండు
గీ. మనుచుఁ బరివారములకెల్ల ♦ నాజ్ఞయొసఁగి
వేడ్కతోనిన్ను వీక్షింప ♦ వేచియుండు
భక్తునకుఁ దత్క్షణమతోఁచు ♦ ప్రభుఁడవీవు
సకలకల్యాణగుణధన్య! ♦ సర్వమాన్య!

సీ. దోషసైన్యంబులఁ ♦ దూలిపోనేయ 'ఫి
రంగి' యాభక్తి తె ♦ అంగుసుమ్ము
పాపనౌకావళిఁ ♦ బ్రద్దలుగొట్టంగ
బలమైన 'టార్పెడో' భక్తిసుమ్ము
అఘరణపోతమ్ము ♦ నద్భుతంబుగముంపఁ
బ్రబలమౌ 'సబ్ మెరైన్' ♦ భక్తిసుమ్ము
భవప్రపంచమ్ముల ♦ భస్మమ్ముగావింపఁ
బాశుపతాస్త్రమ్ము ♦ భక్తిసుమ్ము
గీ. సకలసంసార సాగర ♦ సన్నిబద్ధ
జాలములనెల్లఁ దెగఁద్రుంపఁ ♦ జాలి మోతు
వప్రమునుగూర్చు సేనాని ♦ భక్తిసుమ్ము
సకలకల్యాణగుణధన్య! ♦ సర్వమాన్య!

సీ. ధారాళమౌదయా ♦ సారమ్ము లేనట్టి
హృదయమ్ము మకరంద ♦ హీనసుమము
విద్యావిహీనుని ♦ విఫలమౌజన్మమ్ము
వెలుతురు లేనట్టి ♦ విడిదిసుమ్ము
సుగుణసంపద లేని ♦ సుదతిచక్కదనమ్ము
తంతులు లేనిసి ♦ తారువినుము
నీతిలేనట్టి దు ♦ ర్జాతి కవిత్వమ్ము
మానమ్ము లేని యా ♦ సానిసొమ్ము
గీ. పరమపావనమైనట్టి ♦ భక్తి లేని
వాఁడు దల లేని మొండెమ్ము ♦ వానికంటె
నధముఁడెవ్వాఁడు కరుణాసు ♦ ధాబ్ధి! చెప్పుమ
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య! 32
సీ. పట్టెడన్నము వెట్టు ♦ పతికిఁ బ్రాణంబైన
నెమ్మినోసంగు శ్వా ♦ నమ్ము మేలు
పచ్చిక మెసవియా ♦ ప్యాయమానంబుగా
నమృతంబు పిదికెడు ♦ నావు మేలు
ఇంతనీరముఁగొని ♦ యెంతయుమధురజ
లమ్మిచ్చునారి కే ♦ ళమ్ము మేలు
జలమిడువారికి ♦ ఫలము లేకొకుండ
కాయమేయొప్పించు ♦ కదళి మేలు
గీ. నీదయావృష్టి చేతను ♦ నెగడుచుండి
హృదయకుసుమంబు నీకు న ♦ ర్పింపకుండు
కూళనరపశువునకంటెఁ ♦ గోటిరెట్లు
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య 33

సీ. తరణితాపమున సం ♦ తప్తంబులైనను
దమనీడలోరులకు ♦ దయనొసంగు
ఱివ్వనరాళ్ళచే ♦ ఱువ్విన సహియించి
పక్వఫలంబులఁ ♦ బ్రతిగఁబెట్టు
దలమీఁదికెక్కి నృ ♦ త్యములుసల్పెడునట్టి
ప్రాణికోటులకుసం ♦ వాసమిచ్చు
నఱికివైచెడువారి ♦ కొఱకును సౌఖ్యముల్
దొరకొనఁజేయును ♦ మఱచికీడు

గీ. నౌర! తమజీవితములోన ♦ నమలమైన
ధర్మమేబోధ సేయునీ ♦ తరులుగూడఁ
బరతనినుఁగొల్చునాభక్త ♦ వరునిఁబోలి
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య!

సీ. పురుషరత్నముఁగాంచి ♦ పొంగునువంశమ్ము
ప్రజలసేమముఁగని ♦ ప్రభువుపొంగుఁ
దఱిఁదగువర్షంబు ♦ గురియఁగాఁపుప్పొంగుఁ
బెన్నిధిఁగాంచినఁ ♦ బేదపొంగు
బతియాదరించిన ♦ సతికడునుప్పొంగు
దానపాత్రునకిచ్చి ♦ దాతపొంగుఁ
దనయుఁడుఘనుఁడైనఁ ♦ దండ్రితానుప్పొంగు
జయమందశూరుఁడు ♦ చాలఁబొంగు

గీ. నిఖిలభూతగణంబుల ♦ నిండియుండు
నిన్నుఁజూచినయపుడెల్ల ♦ నీదుభక్తుఁ
డెంతయునుబొంగుఁజెప్పఁగా ♦ నంతపొడవు
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య!

# సర్వమాన్యశతకము.

సీ. తులలేనిసిరులచేఁ ♦ దులఁదూఁగువాఁడైన
నంత్యాననిర్ధనుం ♦ డగుచుఁబోవు
రాజులలోనెల్ల ♦ రాజాధిరాజైనఁ
దుదకురాష్ట్రములెల్ల ♦ వదలిపోవు
బలవంతులకునెల్ల ♦ బలవంతుఁడైనను
గడకునాబలముఁగో ♦ ల్పడుచుఁబోవు
రూపవంతులకెల్ల ♦ రూపవంతుండైనఁ
జివరకురూపఱి ♦ చిన్నవోవు
గీ. నిన్నియునుగల్గఁగొనకున ♦ వెల్లఁబోవు
నీదుభక్తియెనిరతంబు ♦ నిలిచిపోవు
దానినార్జింపసుఖములు ♦ దఱుఁగఁబోవు
సకలకల్యాణ గుణాధన్య! ♦ సర్వమాన్య!
సీ. అసహాయశూరున ♦ కవ్యాజకరుణయే
యందమైయొప్పియా ♦ నందమిచ్చుఁ
బండితోత్తమునకు ♦ భవ్యమావినయమే
గౌరవంబునుగూర్చి ♦ కలిమిఁదెచ్చు
విజ్ఞానజలధికి ♦ విమలవివేకమే
సద్భూషణంబయి ♦ శాంతిఁగూర్చు
ధనవంతునకుమహా ♦ దానవైదగ్ధ్యమే
క్షీణింపఁబోనిస ♦ త్కీర్తినించు
గీ. నిశ్చలంబైననీభక్తి ♦ నిజముగాను
గలిగెనేనందఱకునలం ♦ కారమగుచు
బొల్చుసంతోషవార్ధిలో ♦ ముంచితేల్చు
సకలకల్యాణగుణాధన్య! ♦ సర్వమాన్య!

సీ. మనమునసద్గుణ ♦ గణములుచిగురింప
నదివసంతంబని ♦ యలరుచుండుఁ
బాపజాలమ్ములు ♦ పరితాపములనింక
నదిగ్రీష్మఋతువని ♦ యభినుతించు
స్వాంతంబుకరుణాప్ర ♦ వాహంబుతోనిండ
వర్షకాలంబని ♦ హర్షమొందు
భావాననీకీర్తి ♦ పర్వివెన్నెలఁగాయ
శరదాగమంబని ♦ సంతసించు
గీ. నఘమువణఁకును గొల్పహి ♦ మార్తియంచు
దోషములురాలశిశిరముఁ ♦ దోఁచెనంచు
నుబ్బుచుండునునీభక్తుఁ ♦ డుబ్బరముగ
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య!
సీ. పరమేశనీభక్తి ♦ వరవిమానంబెక్కి
చూడ్కికివిందుగాఁ ♦ జూచునపుడు
జలధులన్నియునొక్క ♦ జలజాకరముగాఁగ
భూమియంతయుఁదమ్మి ♦ పూవుగాఁగ
వివిధదేశమ్ములు ♦ వెలయురేకులుగాఁగ
వనపంక్తికేసర ♦ పాళిగాఁగ
ప్రవహించునదులుమ ♦ రందధారలుగాఁగ
శైలజాలముషట్ప ♦ దాళిగాఁగఁ
గీ. దోఁచ నానందమున నేమి ♦ దోఁచకుండ
మఱచిపోవునుదనువాని ♦ నురుసమాధి
యుక్తుఁడై భవదీయాస ♦ ద్భక్తవరుఁడు
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య!

సీ. క్షమయనుకవచంబుఁ ♦ జక్కఁగా ధరియించి
శ్రద్ధాకిరీటంబు ♦ సంఘటించి
భక్తియన్ డాలును ♦ బదిలమ్ముగాఁ బట్టి
సత్యమన్ శస్త్రంబు ♦ సరగఁ దాల్చి
దయయనుదూతను ♦ దగుసంధికై పంచి
వేగువానిగఁ దన ♦ విద్యనునిచి
లోకశత్రులార్వుర ♦ లోపలబంధించి
యజ్ఞానమున్ దెగ ♦ టార్పనెంచి
గీ. రాజరాజగునీయాజ్ఞ ♦ రక్తిఁ గాంచి
ధర్మరంగంబునందుయు ♦ ద్ధంబుసేయు
సిద్ధమైపోల్చు నీభక్తుఁ ♦ జెనకఁదరమె ?
సకలకల్యాణ గుణధన్య ! ♦ సర్వమాన్య ! 40

సీ. దుఃఖముల్ కొండలై ♦ దొర్లి వచ్చునుగాక
చింతలు చిఱుతలై ♦ చీల్చుఁగాక
శోకముల్ వార్ధులై ♦ చుట్టిముంచునుగాక
యర్చులై తాపమ్ము ♦ లేర్చుఁగాక
బాధలు పాములై ♦ పట్టిపీఁకునుగాక
యార్తిపెన్ రోగమై ♦ యడరుఁగాక
పిడుగులై యాపదల్ ♦ పేర్చిపైఁ బడుఁగాక
మృత్యువు సింహమై ♦ మ్రింగుఁగాక
గీ. నిన్ను శరణంబుగా నెంచి ♦ నిష్కళంక
భక్తిచేఁ గొల్చిపోల్చెడు ♦ భక్తవరుని
హృదయమింతయు ♦ బెదరక చెదరకుండు
సకలకల్యాణ గుణధన్య ! ♦ సర్వమాన్య ! 41

సీ. భక్తరక్షణకళా ♦ భరణుండవనుటకు
యోగ్యుఁడౌ 'ప్రహ్లాదుఁ' ♦ డొక్కసాక్షి
సత్యసంధులఁగాచు ♦ స్వామినీవనుటకు
నుర్వి'హరిశ్చంద్రుఁ' ♦ డొక్కసాక్షి
పరిశుద్ధహృదయుల ♦ ప్రాపునీవనుటకుఁ
బెక్కురలో'ధ్రువుం' ♦ డొక్కసాక్షి
స్వామిభక్తులను సం ♦ భావింతువనుటకు
న'క్కేసరికుమారుఁ' ♦ డొక్కసాక్షి
గీ. సకల హృదయంబులనుజూచు ♦ సర్వసాక్షి
వీవయనుటకుయోగీంద్రు ♦ లెల్లసాక్షి
సాక్షులకు నీవుప్రత్యక్ష ♦ మైనసాక్షి
సకలకల్యాణ గుణధన్య ! ♦ సర్వమాన్య ! 42

సీ. నీదాసులెందఱో ♦ నీచిత్తమలరింపఁ
గడఁకతోనోర్చిరి ♦ కష్టములను
బండితులెందఱో ♦ భక్తితోనినుఁగొల్వఁ
గడఁకతోనోర్చిరి ♦ కష్టములను
ఆర్యులెందఱోనీదు ♦ నాజ్ఞలఁజెల్లింపఁ
గడఁకతోనోర్చిరి ♦ కష్టములను
ఎలమితోఁడమహాత్ము ♦ లెందఱోనినుఁగోరి
కడఁకతోనోర్చిరి ♦ కష్టములను
గీ. భక్తవరులెల్ల నిట్టులు ♦ పడెడునట్టి
కష్టమేకదనీకున ♦ భీష్టమైన
వజ్రమణి భూషణంబయి ♦ వఱలుదేవ
సకలకల్యాణ గుణధన్య ! ♦ సర్వమాన్య 43

సీ. ప్రజకు స్వారాజ్యమే ♦ పరమావధియటంచుఁ
దేటగాఁజాటెడు ♦ ధీరమతులు
కష్టమ్ములెన్నని ♦ గడకతోనోర్చి
న్యాయమ్ముగాపాడు ♦ నమలమతులు
సత్యమే నమ్ముచు ♦ సత్యమేపల్కుచు
సత్యమనుష్ఠించు ♦ సరళమతులు
ఏకార్యమైనని ♦ న్నీశ్వరుఁదలఁపక
యాచరింపకయుండు ♦ ననఘమతులు
గీ. దేశభక్తులు దమతమ ♦ దేశములను
నుద్ధరించుటనీపరి ♦ శుద్ధమైన
భక్తి గల్గుటచేఁగదా ♦ పరమపురుష!
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య! 44

సీ. క్షమలోయుధిష్ఠిర ♦ క్ష్మాపాలవరుఁబోలి
సత్యంబుననుహరి ♦ శ్చంద్రుఁబోలి
పూన్కిసాధించు పెం ♦ పునభగీరథుఁబోలి
ధృతిదానములలోద ♦ ధీచిఁబోలి
శౌర్యసాహసముల ♦ సవ్యసాచినిబోలి
నీతిశ్రీరాముని ♦ రీతిఁబోలి
దయలో నశోకుఁడౌ ♦ ధరణీధవునిఁబోలి
బలవీర్యములమరు ♦ ద్భవులఁబోలి
గీ. జ్ఞానభక్తి విరక్తులే ♦ మానములుగఁ
గలిగివర్తిల్లి ధన్యులై ♦ వెలయుచుంద్రు
నిన్నుమదిఁగన్నయట్టి ప్ర ♦ సన్నమతులు
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య! 45

సీ. పట్టాభిషేకంబు ♦ వనవాసమ్ముగ మాఱఁ
జింత 'శ్రీరాముని' ♦ జేరకునికి,
దనసతీమణిఁదానె ♦ తునుమఁగల్గిన వేళ
వగ 'హరిశ్చంద్రు'ని ♦ వంచకునికి
దర్పించి తండ్రిబా ♦ ధలుపెట్టుసమయాన
వంత ప్రహ్లాదుని ♦ వాల్చకునికిఁ
దనదు సర్వస్వంబు ♦ ధారవోపట్టిన
శోకంబు 'బలి' వైపు ♦ చూడకునికిఁ
గీ. కారణము వారిమానస ♦ కమలమందు
సుస్థిరంబుగఁ బొల్చెడు ♦ శుద్ధమైన
భక్తియే కాక మఱివేఱు ♦ శక్తియున్నె?
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య!
సీ. ఏకపత్నీవ్రతం ♦ బెవ్వనివ్రతమన్న
నితనిదంచని చెప్ప ♦ నెసఁగువాఁడు
శరణాగతత్రాణ ♦ బిరుద మెవ్వనిదన్న
నితనిదంచని చెప్ప ♦ నెసఁగువాఁడు
పితృవాక్యపాలన ♦ ప్రీతుఁ డెవ్వండన్న
నీతఁడంచని చెప్ప ♦ నెసగువాఁడు
జనులపాలిఁటిషారి ♦ జాత మెవ్వండన్న
నీతఁడంచని చెప్ప ♦ నెసఁగువాఁడు
ఎలమినిన్నుఁ గొల్చుయోగీంద్రుఁ ♦ డెవ్వఁడన్న
నీతఁడంచని చెప్పంగ ♦ నెసఁగువాఁడు
రామవిభుఁడాతనికిసాటి ♦ రాజుగలఁడె?
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య

సీ. ఆఱుచేతనున్నట్టి ♦ యఖిలసామ్రాజ్యమ్ము
వదలి సత్కీర్తిచేఁ ♦ బొదలినాఁడు
అన్యాయ మొనరించు ♦ నాచార్యునైనను
శిక్షించి నీతిర ♦ క్షించినాఁడు
వృద్ధత్వమున వైరి ♦ వీరాగ్రగణ్యుల
వేటాడి శౌర్యమ్ముఁ ♦ జాటినాఁడు
శరతల్పగతుఁడయి ♦ సకలధర్మంబులఁ
గఱపుచు శాంతంబుఁ ♦ గురిసినాఁడు
గీ. బ్రహ్మచర్యగరిష్ఠుఁడై ♦ ప్రబలినాఁడు
నిన్ను నిరతంబు మదిలోన ♦ నిల్పినాఁడు
'భీష్ము' నంతటి భక్తుండు ♦ పృథ్వి నెవఁడు
సకలకల్యాణ గుణధన్య ! ♦ సర్వమాన్య! 48

సీ. కనిగంగఁ బాఱవై ♦ చినతల్లి కుంతికిఁ
గోరినకోర్కులఁ ♦ గూర్మినొసఁగెఁ
గపటంబుతో వచ్చి ♦ కవచకుండలముల
నింద్రుండు వేఁడిన ♦ నెలమి నొసఁగెఁ
బెంచినవారలు ♦ బెస్తలేయైనను
మమతతో సకలస ♦ న్మానమొసఁగెఁ
దనయంతవానిగా ♦ మనిచిన కౌరవ
పతికి రణంబునఁ ♦ బ్రాణమొసఁగె
గీ. దాతలకు దాతవగుటను ♦ దలఁచి నీకు
ముదముతోఁ దనపరిశుద్ధ ♦ హృదయమొసఁగె
దాతయనఁ 'గర్ణు' డొక్కండె ♦ దాతభువిని
సకలకల్యాణ గుణధన్య ! ♦ సర్వమాన్య ! 49

సీ. నరకుని చెఱఁబడ్డ ♦ నరనాథకన్యల
మానముఁగాచిన ♦ మహిమతోడఁ
బాడిఁదప్పనియట్టి ♦ పాండుపుత్రులఁబ్రోచి
ప్రతినదీర్చినమహా ♦ ప్రతిభతోడ
దీనాతిదీనుల ♦ ధీరులుగామార్చు
శక్తిగల్గినయోగ ♦ శక్తితోడ
భక్తుఁగుచేలుని ♦ బాల్యమిత్రునిగృత
కృత్యుఁజేసినశుభ్ర ♦ కీర్తితోడ
గీ. నీదునాజ్ఞలఁదలఁదాల్చి ♦ నెగడుచుండు
నీతిపరులనుసేవించు ♦ నియతితోడ
వెలుగు 'శ్రీకృష్ణుఁ' డొకవింత ♦ వెలుఁగుగాదె?
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య! 50

సీ. అంతటనినుఁజూచి ♦ యఖిలంబునీవని
సర్వస్వమర్పించె ♦ 'శంకరుండు'
అన్నియునీదని ♦ యభిమానమునుమాని
మానకకొల్చె 'రా ♦ మానుజుండు'
నేనెంతవాఁడను ♦ నీవెనాప్రభువని
యర్చించె 'మధ్వ'నా ♦ మాంకితుండు
వరభక్తులగుటచే ♦ వారలనామంబు
లాచార్యపదవిని ♦ నలరుచుండు
గీ. నిన్ను నిర్మలభక్తిచేఁ ♦ గన్నవారి
కీర్తిసంపూర్ణ చంద్రుని ♦ మూర్తినవ్వి
వెలుఁగుచుండును జగములు ♦ వెలుఁగుదాఁక
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య! 51

సీ. 'షాలిస్థలి'ని బాప ♦ పసుల'యహూదీ'ల
నుద్ధరింపఁగఁబ్రాణ ♦ మొసఁగెనొకఁడు
మొరకుతౌనరబియా ♦ తురకలసవరింపఁ
బడరాని కడగండ్లఁ ♦ బడియెనొకఁడు
భరతఖండమునందుఁ ♦ బ్రబలినక్రౌర్యంబుఁ
బాపసర్వస్వంబుఁ ♦ బాసెనొకఁడు
హిందూమహాజాతి ♦ కందుకుందులడింప
విసము ప్రేముడితోడ ♦ మెసవెనొకఁడు
గీ. సతుల సహగమనంబు ల ♦ సహ్యమంచు
నుడుపఁబర దేశమున కేగి ♦ మడిసెనొకఁడు
భక్తులన నిట్టివారలో ♦ పరమపురుష!
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య! 52
సీ. దయకంటె మించిన ♦ ధర్మంబుమఱిలేదు
దయకునునీకుభే ♦ దంబులేదు
దయనుజూపెడువాఁడె ♦ ధన్యచరిత్రుండు
దయలేనివానినే ♦ దనుజుఁడండ్రు
దయయడుగంటిన ♦ ధరనరకంబగు
దయచేతనే స్వర్గ ♦ ధామమగును
దయయెకోరుచునుండ్రు ♦ ధరణినందఱుఁగూడ
దయయందె విశ్వంబు ♦ దనరుచుండు
గీ. నని'మహావీరుఁ'డనుభక్తుఁ ♦ డవనియందుఁ
జాటెనాబుద్ధదేవుని ♦ సాటివాఁడు
దయకు సర్వమొసంగిన ♦ ధర్మవిదుఁడు
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య! 53

సీ. తేజస్స్వరూప! నీ ♦ తేజంబునొక్కింత
యవనిలోవింతగా ♦ నగ్నిచూపు
సత్యాకృతీ! నీదు ♦ సత్యంబునొక్కింత
యవనిలోవింతగా ♦ నగ్నిచూపుఁ
జైతన్యరూప! నీ ♦ చైతన్యమొక్కింత
యవనిలోవింతగా ♦ నగ్నిచూపుఁ
బరిశుద్ధమూర్తి! నీ ♦ పారిశుద్ధ్యమొకింత
యవనిలోవింతగా ♦ నగ్నిచూపు
గీ. నంచునిను నగ్నినార్యులు ♦ గాంచినట్లు
భక్తమణి 'జడత్కృష్ణుఁ'డట ♦ పారసీకుఁ
డగ్నినిన్నుఁగాంచి పూజించి ♦ యలరినాఁడు
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య!
సీ. నీనివాసంబగు ♦ నిర్మలహృదయమే
భాసిల్లుచుండు కై ♦ లాసమంచుఁ
బసులనెంతయుఁ బ్రేమఁ ♦ బాలించుచుండుట
శ్రీకరంబగునంది ♦ సేవయంచు
నిరుపమానంబగు ♦ నీతత్త్వమెఱుఁగుటే
యుమనుబూజించెడు ♦ క్రమమటంచు
మంగళప్రదుఁడవై ♦ మహిమనొప్పెడునీకె
శివనామ మెంతయుఁ ♦ జెల్లునంచు
గీ. జగతినంతటఁ జక్కఁగాఁ ♦ జాటుటకును
బంపెశిష్యుల భవదీయ ♦ భక్తవరుఁడు
'బసవ'ఁడను పేర నొప్పెడు ♦ భవ్యయశుఁడు
సకలకల్యాణగుణధన్య! ♦ సర్వమాన్య!

సీ. కనకకామినులపై ♦ మనసునుబోనీక
లోభమోహమ్ముల ♦ లొంచినాఁడు
సర్వమతమ్ములఁ ♦ జక్కఁగాఁబరికించి
యెలమితోడసమన్వ ♦ యించినాఁడు
అతిశయశ్రద్ధతో ♦ యమనియమాదులఁ
దాల్చిద్వంద్వమ్ములఁ ♦ గెల్చినాఁడు
ఏకాగ్రమతితోడ ♦ నీశ్వర! నినుఁగాంచి
యోగీశ్వరుండయి ♦ యొప్పినాఁడు
గీ. జ్ఞాన తేజంబుచేత న ♦ జ్ఞానతమముఁ
బాపుకొని లోకబంధువై ♦ పరఁగినాఁడు
భవ్య 'శ్రీరామకృష్ణా'ఖ్య ♦ పరమహంస
సకలకల్యాణ గుణధన్య ♦ సర్వమాన్య! 56
సీ. సుజ్ఞాని 'నానకు' ♦ శుద్ధజీవనమున
బలమునూఁదినది నీ ♦ భక్తి కాదె?
నిరుపమ 'చైతన్య' ♦ చరితామృతమునందు
స్వాదముంచినదినీ ♦ భక్తి కాదె?
'రామమోహను'ని స ♦ ద్రమణీయచరితలో
బ్రభను గొల్పినదినీ ♦ భక్తి కాదె?
శ్రీదయానందుని ♦ చిత్రచారిత్రకు
రక్తిఁదెచ్చినది నీ ♦ భక్తి కాదె?
గీ. క్షితితలేశ్వరు లెల్లను ♦ శిరమువంచి
దండములు పెట్టునంతయు ♦ ద్దండశక్తి
యుక్తమైపొల్చుచున్నది ♦ భక్తి కాదె?
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య! 57

సీ. 'నానకు' శుద్ధవి ♦ జ్ఞానప్రతాపముల్
'గోవిందుసింహు' లోఁ ♦ గొమరుమిగిలె
'రామమోహను'ని స ♦ ద్రమణీయ తేజముల్
'దేవేంద్రనాథు' లోఁ ♦ దేజరిల్లె
'శ్రీదయానందు'ని ♦ చిత్రప్రదీప్తులు
'లేఖరాము' నియందు ♦ లీలసలిపె
'శ్రీవివేకానందు' ♦ చిత్తంబులోపలఁ
'బరమహంసు' నికళల్ ♦ ప్రజ్వరిల్లెఁ
గీ. దరణితేజంబు చంద్రులోఁ ♦ దనరుకరణి
హృదయమోదమ్ము మోమునఁ ♦ బొదలునట్లు
నీమహిమ భక్తవరునిలో ♦ నెగడురీతి
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య! 58

సీ. కవిముఖమ్మునమహా ♦ కవితాలహరిగంగ
నెనసిబోరునఁ బ్రవ ♦ హించుచెల్ల
శూరునిలోనుండి ♦ సూర్యతాపమువలె
నంతకంతకు శౌర్య ♦ మడరుచెల్ల
సుజ్ఞానిలోనుండి ♦ శుభ్రాంశుకిరణాళి
పగిదిఁ బ్రబోధముల్ ♦ ప్రబలుచెల్ల
సదయాత్మహృదయాన ♦ సంద్రంబుచందానఁ
గరుణపైఁ బైఁ బొంగి ♦ పొరలుచెల్ల
గీ. వారిపరిశుద్ధమానసాం ♦ భోరుహములఁ
గ్రాలుభక్తిమరందంబుఁ ♦ గ్రోలుచుండు
బంభరంబైన నీప్రభా ♦ వమునఁగాదె?
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య! 59

సీ. సకలరసంబుల ♦ శబ్దంబులనుగూర్చి
చెవిగుండ మనసులోఁ ♦ జేర్చుసుకవి
అఖిలరసంబుల ♦ నాకారములఁగూర్చి
కనుమూలమున బుద్ధిఁ ♦ జొనుపుశిల్పి
కనులేనివానికిఁ ♦ గవియెక్కుడుగఁదోఁచుఁ
జెవిటికినధికుఁడై ♦ శిల్పిదోఁచుఁ
గనులును గర్ణముల్ ♦ గలవారికిరువురు
సమముగాఁదోఁతురు ♦ జగతియందుఁ
గీ. కవులశిల్పుల నిర్మించి ♦ కనులుసెవులు
మాకునీవు ప్రసాదింప ♦ మహిమలెల్ల
జూచుభాగ్యంబు సమకూరు ♦ చుండుఁగాదె?
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య! 60

సీ. రామకథాసుధా ♦ రసమువర్షించిన
'యాదికవీంద్రు'ని ♦ యమలమతికి
నాటకసంధాన ♦ ధాటీవిహారియౌ
'కాళిదాసు'నికళా ♦ కలితమతికిఁ
బ్రౌఢమహాకావ్య ♦ రచనాధురీణుఁడౌ
'శ్రీహర్ష' కవివర్యు ♦ చిత్రమతికి
శబ్దప్రయోగకౌ ♦ శలవిదగ్ధుండగు
'భట్టబాణు'నిమహా ♦ భవ్యమతికిఁ
గీ. జండతరశబ్దరుచిర బ్ర ♦ హ్మాండమునకు
దండమైపొల్చుదండియు ♦ ద్దండమతికి
నాలవాలమునీదు వి ♦ శాలమహిమ
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య! 61

సీ. 'నన్నయ' నీశర ♦ ణంబు నొందకయున్న
'వాక్ఛాసనుం'డయి ♦ వఱలువాఁడె?
'తిక్కన'నీభక్తిఁ ♦ దేలియాడకయున్నఁ
'గవిబ్రహ్మ' యైకీర్తి ♦ గాంచువాఁడె?
'పోతన' నినుఁగాంచి ♦ పొంగికొల్వకయున్న
'సహజపాండిత్యుఁ'డై ♦ చనెడువాఁడె?
'శ్రీనాథుఁ'డేనిన్నుఁ ♦ జింతింపకుండినఁ
'గవిసార్వభౌముఁ'డై ♦ క్రాలువాఁడె?
గీ. 'నాచనాన్వయశ్రీసోమ ♦ నాథసుకవి'
సర్వమర్పించి నీసేవ ♦ సలుపకున్న
భవ్య 'సర్వజ్ఞ' చిహ్నుఁడై ♦ ప్రబలువాఁడె?
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య! 62

సీ. నారదమునిభాతి ♦ నవనవరీతుల
భక్తిగీతమ్ములఁ ♦ బాడిపాడి
అన్యోన్యమగుప్రేమ ♦ నందఱిలోఁగొల్ప
భవ్యవాగ్ఝరులను ♦ పన్యసించి
గురుశిష్యధర్మముల్ ♦ గూర్మితో నేర్పంగ
నవ్యశాంతినికేత ♦ నంబునిలిపి
విశ్వభారతియను ♦ విమలవిద్యాపీఠ
మును నెలకొల్పెడు ♦ పనికిఁబూని
గీ. ఆసియాకవిసార్వభౌ ♦ మాంకమంది
నిండుకీర్తి 'రవీంద్రనా ♦ థుండు' గనుట
భక్తితో నిన్నుఁగొల్చుట ♦ వలనఁగాదె?
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య! 63

సీ. ప్రాచీనభారత ♦ భవ్యదృశ్యమ్ముల
బుద్ధిలోఁదలపోసి ♦ భువనమెఱుఁగ
నమల చిత్రమ్ముల ♦ నలవరించుటె కాక
కడుఁజిత్రముగజీవ ♦ కళలనించి
జాతిజీవనములో ♦ నూతనోజ్జీవంబు
చిత్రచాతురిచేతఁ ♦ జెలఁగనిచ్చి
యాసేతుశీతమ ♦ హాచలపర్యంత
భరతభూమికిగౌర ♦ వంబుఁగూర్చి
గీ. యింటనింటను గంటికి ♦ నింపునింపి
పూతచారిత్రములబుద్ధి ♦ పొడమఁజేసి
కీర్తి 'రవివర్మ' గనుటనీ ♦ కృపనుగాదె?
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య! 64
సీ. బాలవితంతుల ♦ పరితాపములనార్ప
జనకుఁడై 'యీశ్వర ♦ చంద్రుఁ'డొప్పె
నతఁడేయితండన ♦ నతికృపామతియయి
'వీరేశలింగము' ♦ వినుతికెక్కెఁ
బరిశుద్ధభక్తిచే ♦ భవ్యవాక్సుధలచేఁ
'గేశవచంద్రసేన్' ♦ కీర్తిఁగాంచె
నతఁడేయితండన ♦ నమలవర్తనముచే
'రఘుపతివేంకట ♦ రత్న'మమరె
గీ. నహహ! ఈశ్వర కేశవు ♦ లంతవారు
వీరరత్నంబులలరిన ♦ విమలభూమి
భక్తులకునాటపట్టయి ♦ ప్రబలకున్నె?
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య! 65

సీ. భక్తిభీష్ముండని ♦ ప్రఖ్యాతివడసిన
'శివనాథశాస్త్రి'తోఁ ♦ జెలిమినెఱపి
కార్యశూరుండును ♦ గరుణానువర్తియౌ
'వీరేశలింగార్యు' ♦ దారిఁద్రొక్కి
పాంచాలమండలి ♦ భక్తాగ్రమణులలో
'గురుదత్తవిద్యార్థి' ♦ గుణముగలిగి
యెన్నికీడులుమూఁడి ♦ తన్నుబాధించిన
నిన్నుఁజిత్తమునందు ♦ నిలిపియోర్చి
గీ. పిన్నయయ్యును భక్తిలోఁ ♦ బెద్దయగుచు
దేశరాజాన్వయాగార ♦ దీపమైన
'పెద్దబాపయ్య'కిలనెవ్వ ♦ రుద్దియయ్యె?
సకలకల్యాణ గుణధన్య! సర్వమాన్య! 66

సీ. శ్రీనాథుఁడైనను ♦ జిఱుపద్దెమేఁజెప్పఁ
జాలునే నీదయ ♦ చాలకున్న?
నర్జునుండైనను ♦ నంగుళినెత్తఁ
జాలునే నీదయ ♦ చాలకున్న?
వలఁతినారదుఁడైన ♦ నలగీతమేన్బాడఁ
జాలునే నీదయ ♦ చాలకున్న?
హనుమంతుఁడైనను ♦ నణువేనియును మోయఁ
జాలునే నీదయ ♦ చాలకున్న?
గీ. కాన నీదయగల్గెడు ♦ కరణిమెలఁగి
భక్తులందఱుఁదమతమ ♦ భక్తికొలఁదిఁ
గార్యసాఫల్యమును బొంది ♦ క్రాలుచుంద్రు
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య! 67

సీ. బొబ్బిలిశ్రీరంగ ♦ భూజానినకలంక
శౌర్యశోభితయశ ♦ స్సాంద్రుఁజేసి
మాడభూమికులంపు ♦ మణివేంకటాచార్య
నతులావధానవి ♦ ఖ్యాతుఁజేసి
భాష్యమయ్యంగారి ♦ బహుసూక్ష్మన్యాయైక
వీక్షణంబున మహా ♦ దక్షుఁజేసి
శ్రీకోడిరామమూ ♦ ర్తిని నద్భుతంబగు
బలముచేగౌరవ ♦ కలితుఁజేసి
గీ. భక్తిరసమును గురిపించు ♦ భవ్యకృతులఁ
ద్యాగరాజునుబరిపూర్ణ ♦ ధన్యుఁజేసి
పొల్చునినుఁగొల్చి శుభములఁ ♦ బొందరాదె?
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య! 68
సీ. తరులందుఁగూడఁజై ♦ తన్యంబుఁజూపంగఁ
జాలిన 'జగదీశ ♦ చంద్రబోసు'
సకలరసాయన ♦ శాస్త్రశోధనలందుఁ
జతురుఁడైన 'ప్రఫుల్ల ♦ చంద్రరాయి'
గణితశాస్త్రమునందు ♦ గణ్యతవహించి
మహితాత్ముఁడైన 'రా ♦ మానుజమ్ము'
గగనయానంబులఁ ♦ గట్టుటలోనేర్పుఁ
జూపిన 'వేంకట ♦ సుబ్బశెట్టి'
గీ. గానవిద్యను విఖ్యాతిఁ ♦ గన్న 'బర్వె'
మల్లురకు నెల్లమాన్యుఁడై ♦ మన్న 'గామ'
నీకృపనుబుట్టి యిబ్భువి ♦ నెగడినారు
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య! 69

సీ. శ్రీఛత్రపతిశివా ♦ జీచరిత్రనువ్రాసి
వీరరసంబును ♦ వెల్లిగొలిపి
విజ్ఞానచంద్రికఁ ♦ వెలయింపఁగాఁజేసి
ప్రజ్ఞావిశేషముఁ ♦ బ్రకటపఱచి
భవ్యాంధ్రసాహిత్య ♦ పరిషన్మహోద్ధార్య
నిచయంబునేర్పుతో ♦ నిర్వహించి
విశ్వకోశంబగు ♦ విజ్ఞాన సర్వస్వ
మునకు సర్వస్వంబు ♦ ముట్టఁజెప్పి
గీ. నిర్మలఖ్యాతి భువినిల్పి ♦ నిన్నుఁజేరె
శ్రీ కొమర్రాజువంశాబ్ధి ♦ శీతకరుఁడు
మహిత గుణశాలిలక్ష్మణా ♦ మాత్యమౌళి
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య!
సీ. ప్రాచీన శిథిలకా ♦ వ్యములనుశోధించి
ప్రకటింపఁబండిత ♦ పాళిఁగొలిపి
ఆంధ్రభాషాసేవ ♦ నాచరించుటయందుఁ
దనదు సర్వస్వంబు ♦ ధారవోసి
దీనుల దుఃఖముల్ ♦ దీర్చుకార్యములకై
సకల వ్యయప్రయా ♦ సములకోర్చి
చెలికానివంశమఁ ♦ క్షీరవారాశికిఁ
బరిపూర్ణచంద్రుని ♦ పగిదిఁదనిరి
గీ. చిత్రవాటినివాణి నా ♦ సీనఁజేసి
కడకు నినుఁగొల్చువేడ్కనీ ♦ కడకువచ్చె
లలితగుణములప్రోవుశ్రీ ♦ లచ్చరావు
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య!

సీ. ప్రజకుస్వరాజ్యమే ♦ పరమావధియటంచుఁ
దేటగా 'నౌరోజి' ♦ తెలియఁబఱిచె
సంఘసంస్కరణమే ♦ సర్వసాధనమని
తేటగా'రానడే' ♦ తెలియఁబఱిచె
విద్యయుండినఁగాని ♦ వెలయదుసుఖమని
తేటగా 'గోఖలే' ♦ తెలియఁబఱిచెఁ
గర్మయోగమునందె ♦ కలదుసర్వంబని
తేటగాఁ 'దిలకుండు' ♦ తెలియఁబఱిచె
గీ. నెన్నియున్నను నీభక్తి ♦ యున్నఁగాని
సర్వసౌభాగ్యమబ్బదు ♦ జనులకంచుఁ
దేటగానుమహాత్ముండు ♦ దెలియఁబఱిచె
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య! 72
సీ. నినుభక్తిమదినిడి ♦ నీతివర్తించుచే
మతమనె 'తాయాబ్జి' ♦ మనుసదృశుఁడు
నినుభక్తిమదినిడి ♦ నీతివర్తించుచే
మతమనె 'ఆండ్రూసు' ♦ మహితయశుఁడు
నినుభక్తిమదినిడి ♦ నీతివర్తించుచే
మతమనె 'నౌరోజి' ♦ మాన్యతముఁడు
నినుభక్తిమదినిడి ♦ నీతివర్తించుచే
మతమనె'మాంటేగ్యు' ♦ మానధనుఁడు
గీ. 'మదనమోహన మాలవ్య' ♦ యదియెయనియె
మతములివియిట్లు నీలోన ♦ మగ్నమయిన
స్వర్గమగుఁగాదె భువియింక ♦ సత్వరముగ
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య! 73

సీ. క్రమకోర్చిసత్వరి ♦ శ్రమలచేయోగ్యమౌ
వాణిజ్యవృత్తికి ♦ వన్నెఁదెచ్చి
కోట్లకొలందిగాఁ ♦ గూర్చిధనమ్ముల
వరవణిక్ప్రభువని ♦ వాసిఁగాంచి
స్థిరమైనలాభంబు ♦ క్షితికిఁగల్గించెడు
విద్యలనార్జించు ♦ నుద్యమమున
ధనరాసులనుమహా ♦ ధారగాఁగురిపించి
'తాత' దాతలకువి ♦ ధాతయగుచు
గీ. నక్షయంబగుకీర్తిని ♦ నమరుటెల్ల
విమలమౌభక్తిహృదయానఁ ♦ గొమరుమిగిలి
యతిశయంబుగవెలిఁగిన ♦ కతనఁగాదె?
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య!
సీ. బానిసవారల ♦ బంధవిముక్తికై
జంకకపోరిన ♦ 'లింక' నొకఁడు
'పోపు' లదార్జన్య ♦ మునుధిక్కరించిన
యుత్తమయోధుఁడౌ ♦ 'ల్యూథ' రొకఁడు
నరకంబులుగనున్న ♦ చెఱలనుసవరించి
మనిన 'హోవార్డను' ♦ మాన్యుఁడొకఁడు
కొజ్జాలఁగల్పించు ♦ క్రూరకార్యంబును
ఖండింపఁబుట్టఁబో ♦ నుండునొకఁడు
గీ. లోకశోకంబులార్పప్ర ♦ లోభములను
వదలువారలువీరలె ♦ వ్వారికైన
వందనీయులునీభక్త ♦ వరులుగాన
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య!

సీ. ఆవిరిలోపల ♦ నా'జేమ్సు వాట్టున'
కెలమితోదర్శన ♦ మిచ్చినావు
పైనుండిరాలిన ♦ పండుచే 'న్యూటను'
చిత్తమాకర్షించి ♦ చెలఁగినావు
'ఎడిసన' నాకర్ణింప ♦ వడి 'ఫోనొగ్రాఫులో'
వేడుకతో మాట ♦ లాడినావు
వింతగా మెఱపులో ♦ 'బెంజమన్ ఫ్రాంక్లిను'
తోడదాఁగిలిమూఁత ♦ లాడినావు
గీ. 'మార్కొని' కిఁదీఁగ లేనట్టి ♦ మార్గమందు
వార్తలనుబంపియానంద ♦ వార్ధిలోనఁ
దేల్చినాఁడవునీకృప ♦ తేటపడఁగ
సకలకల్యాణగుణధన్య! ♦ సర్వమాన్య! 76
సీ. అమెరికాకునుస్వేచ్ఛ ♦ నార్జించుటకుగాను
'జార్జివాషింగ్టను' ♦ శౌర్యనిధిని
ఇటలీనిగాపాడ ♦ నేచియాప్ట్రియతోడ
డీకొన 'గ్యారిబా ♦ ల్డి' నిఘనుని
సర్వవిధమ్ముల ♦ చైనానుసవరింప
'సన్ యెట్టుసేను'ని ♦ చతురమతిని
పడియున్నరష్యాను ♦ వడిలేవనెత్తంగఁ
దగిన 'మహాలినన్' ♦ ధైర్యధనుని
గీ. కేవలము టర్కిగాపాడఁ ♦ 'కమలుపాచ్ఛ'
బంపి కృపఁజూపినాఁడవు ♦ పరమపురుష!
దీనులకునెల్ల భువిలోన ♦ దిక్కునీవె
సకలకల్యాణగుణధన్య! సర్వమాన్య! 77

సీ. ఆర్తులపాలికి ♦ నాప్తుఁడై వర్తిల్లి
కీర్తిగాంచినదయా ♦ మూర్తి యెవఁడు?
ప్రభువై జనించియు ♦ విభవమ్ములనుమాని
త్యాగియైమనినవి ♦ రాగియెవఁడు?
అర్థమ్ముసమవిభా ♦ గార్హమః ధర్మమ్ము
దేటగాఁజాటిన ♦ ధీరుఁడెవఁడు?
హింసకహింసయే ♦ హితమహౌషధమని
తనయందుఁజూపిన ♦ ధన్యుఁడెవఁడు?
గీ. ఎన్నికష్టమ్ములోదవిన ♦ నెలమినోర్చి
నీమహాదివ్యపథమున ♦ నెగడెనెవఁడు?
అతఁడు 'టాల్స్టాయి' యనెడుర ♦ ష్యామహర్షి
సకలకల్యాణగుణధన్య! ♦ సర్వమాన్య! 78
సీ. 'సీతామహాదేవి' ♦ శ్రీరామచంద్రుని
వరియించెనుస్స్వయం ♦ వరమునందు
'దమయంతి' నలమహా ♦ ధరణీధవేంద్రుని
వరియించెనుస్స్వయం ♦ వరమునందు
'పాంచాలరాట్సుత' ♦ పాండవోత్తముఁబార్థు
వరియించెనుస్స్వయం ♦ వరమునందు
నట్టిస్వయంవర ♦ మడుగంటిపెండ్లిండ్లు
ప్రబలంగఁజొచ్చెను ♦ బాల్యమందు
గీ. మటలవిద్యాప్రవీణలై ♦ మానవతులు
వరునివరియించినుస్స్వయం ♦ వరమునందు
భవ్యచరితులఁబుత్రులఁ ♦ బడయనిమ్ము
సకలకల్యాణగుణధన్య! ♦ సర్వమాన్య! 79

సీ. నీకరుణావృష్టి ♦ నెగడఁ 'గౌసల్య'కు
రామచంద్రుఁడుపుట్టి ♦ రహీనిగూర్చె
నీయనుకంపచే ♦ నెమ్మి 'దేవకి' కిశ్రీ
కృష్ణుఁడుద్భవమంది ♦ కీర్తిఁజేర్చెఁ
గృష్ణరాయలునీదు ♦ కృపచేత 'నాగమాం
బా' సాధ్వికుదయించి ♦ వాసినించె
నీదయచే 'జిజా' ♦ నిర్మలాత్మకుశివా
జీజనియించిప్ర ♦ సిద్ధిఁదెచ్చె
గీ. నీకటాక్షంబుగల్గిన ♦ నెలతమిన్న
సుగుణమణిభూషణుండగు ♦ సుతునిఁగాంచి
కడుపుచల్లఁగబ్రదుకునీ ♦ పుడమియందు
సకలకల్యాణగుణధన్య! ♦ సర్వమాన్య! 80
సీ. ఏరాజకన్యయు ♦ నెలమిబెండ్లాడని
పుట్టుగ్రుడ్డినిగోరి ♦ చెట్టపట్టి
పతికిలేనిసుఖంబు ♦ సతికినిదగదని
కనులుగప్పడకుండఁ ♦ గట్టుగట్టి
పుత్రులుపెక్కండ్రు ♦ పుట్టిననోకనిని
గనుఁగోకమనసును ♦ గట్టిపెట్టి
యనికేగుసుతుఁడుమ్రొ ♦ క్కినధర్మమే గెల్చు
వత్స! పోపొమ్మని ♦ వరమువెట్టి
గీ. భర్తవెంబడినడవికి ♦ బయలుదేఱి
కష్టములకోర్చె 'గాంధారి' ♦ కడఁకమీఱి
భక్తినీసతిమించిన ♦ వారలేరి ?
సకలకల్యాణగుణధన్య! ♦ సర్వమాన్య! 81

సీ. శ్రీహరిశ్చంద్రుని ♦ బ్రీతితోఁ సేవించి
మహిమమించినచంద్ర ♦ మతియొకర్తు
సత్యవంతునికయి ♦ సకలార్తినోర్చిన
చిత్రచారిత్రసా ♦ విత్రియొర్తు
వీరేశలింగము ♦ వెంటధర్మమునంటి
చనినట్టిరాజ్యల ♦ క్ష్మ్మయొర్తు
పతితోడ దేశసే ♦ వనుజేసికష్టముల్
పడుచుండు 'కస్తూరి ♦ బాయి' యొర్తు
గీ. మఱియుసత్కార్యశూరులై ♦ మహిని వెలసి
భర్తలకుఁదోడునీడలై ♦ పరఁగుసతులు
పూనిసీమెప్పువడసిన ♦ పుణ్యసతులు
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య!
సీ. తిరిగినచోటెల్ల ♦ స్త్రీసమాజమ్ముల
నెలకొల్పుచుండిన ♦ నెలఁతమిన్న
ఆంధ్రజాతికినొక్క ♦ యాభూషణంబయి
యలరుచునుండిన ♦ లలితసుగుణ
సాధ్వీలలామల ♦ చారిత్రరత్నముల్
దండగాఁగూర్చిన ♦ ధన్యచరిత
యనితననందఱు ♦ గొనియాడ వెలసిన
యట్టి 'శ్రీభండారు ♦ అచ్చమాంబ'
గీ. నీదునాజ్ఞలఁజెల్లించి ♦ నిష్కళంక
నీతిఁదాఁజరియించిన ♦ రీతి నెల్లఁ
దెలుపనినుఁజేరవచ్చెనో ♦ దేవదేవ!
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య!

సీ. 'సత్యభామాదేవి' ♦ సమరకౌశలమున
శౌరిని మెప్పించి ♦ సంతసించె;
రణమున దశరథ ♦ ప్రభునకుఁ దోడ్పడి
'కేకయరాట్పుత్త్రి' ♦ కీర్తిఁ గాంచె;
'దుర్గావతీదేవి' ♦ దుష్టుల ఖండించి
తనమానమును గాచి ♦ కొనగతించె;
'పద్మిని' శత్రుల ♦ బలములఁ జెండాడి
పతిఁ జెఱవిడిపించి ♦ భక్తి మించె;
గీ. ఆత్మరక్షాసమర్థమై ♦ యలరునట్టి
యంగబలమును గ్రుంగని ♦ యాత్మబలము
గలుగుధీర లెనీకృపఁ జెలఁగువారు
సకలకల్యాణగుణధన్య! ♦ సర్వమాన్య! 84

సీ. 'సీతాసతీమణి' ♦ చెఱనున్నసమయాన
నోదార్చినది భవ ♦ త్సూక్తి కాదె?
'పాంచాలిఁ' బట్టంగఁ ♦ బఱ తెంచుకీచకుఁ
బడఁదన్నినది భవ ♦ త్పదము కాదె?
'దమయంతి' నడవిలోఁ ♦ దాఁకవచ్చిన వ్యాధు
రూపుమాపినదినీ ♦ చూపు కాదె?
'పద్మిని' జెఱఁగొన ♦ బలసివచ్చిన మ్లేచ్ఛ
బలముఁ గూల్చినదినీ ♦ బలము కాదె?
గీ. సాధ్వులకుమానభంగంబు ♦ సలుప నెంచు
నీచులను బట్టివిదలించి ♦ నీఱుసేయ
నెడ తెగక వేచునదినీదు ♦ కడఁక కాదె ?
సకలకల్యాణగుణధన్య! ♦ సర్వమాన్య! 85

సీ. 'రాణీభవాని' దా ♦ రాజ్యంబుసేయంగఁ
ప్రజలకుసౌఖ్యంబు ♦ ప్రబలుటకును
ధరణి 'నహల్యాంబ' ♦ దయతోడఁబాలింప
స్వర్గధామంబయి ♦ వఱలుటకును
'నూర్జహా' నేలంగ ♦ నూత్నమై భవముల
నెలవుగానిభ్భూమి ♦ యలరుటకును
'ఆమహావిక్టోరి ♦ యా' మాతరక్షింప
శాంతమ్మునాట్యమ్ము ♦ సల్పుటకును
గీ. స్త్రీలుపాలించుభాగ్యంబు ♦ క్షితికిఁగల్గు
సప్పుడెల్లనుసంతోష ♦ మబ్బుటకును
గారణముచూడభవదీయ ♦ కరుణకాదె?
సకలకల్యాణగుణధన్య! ♦ సర్వమాన్య! 86

సీ. బాలవితంతుల ♦ పరితాపములఁగూర్చి
వనరిన 'భగవతీ' ♦ జననిజనని
వరదయాశాలియై ♦ ప్రజలకుమఱవంగ
రాని 'విక్టోరియా' రాణిరాణి
తనదానమహిమచే ♦ ఘనగౌరవమ్ములఁ
దనరిన 'స్వర్ణమా' ♦ దాతదాత
'అమెరికా' చనిభర్త ♦ యమలసంకల్పంబు
సలిపిన 'యానంద' ♦ సాధ్విసాధ్వి
గీ. నిరుపమానందరూపుఁడౌ ♦ నిన్నుమదిని
నిరతమునునిల్పిభజియించి ♦ నెగడినట్టి
భవ్య 'తరిగొండవెంకమ' ♦ భక్తభక్త
సకలకల్యాణగుణధన్య! ♦ సర్వమాన్య! 87

సీ. విద్యసరస్వతీ ♦ విగ్రహంబయి 'రమా'
రమణీలలామంబు ♦ రహివహించె
స్వర్ణగేహాళిపేరఁ ♦ జారుకావ్యమొనర్చి
'కవిసరోజిని' మహా ♦ ఖ్యాతివడసె
మహిళాభినోదినీ ♦ మాసపత్రికఁగూర్చి
'కమలా' సతీతిల ♦ కంబుమించె
స్త్రీచికిత్సలనాంగ్ల ♦ సీమనేరిచివచ్చి
'శ్రీద్వారకాబాయి' ♦ చెన్నుమీఱె
గీ. 'సరళ' 'హరిదేవి' మొదలగు ♦ చారుమతులు
విమలగుణముల విద్దెల ♦ వెలసినారు
నీకృపామృతపూరంబు ♦ నెగడుకతన
సకలకల్యాణగుణధన్య ! ♦ సర్వమాన్య! 88

సీ. శ్రీరామకృష్ణుని ♦ శిష్యురాలై యుండి
యతనిబోధలనెల్ల ♦ నాత్మనిలిపి
భారతోద్ధరణమే ♦ పరమధర్మంబని
తనదేశమునువీడి ♦ తరలివచ్చి
భారతీయులపూర్వ ♦ భవ్యచారిత్రమ్ము
లందమాశైలిని ♦ బొందుపఱిచి
దీనులయాపదల్ ♦ దీర్చుకార్యములందు
శక్తికిమీఱిన ♦ సాయమొసఁగి
గీ. నిష్కళంకప్రవర్తన ♦ నెగడుచుండి
నీదునాజ్ఞలనెఱవేర్చి ♦ నిన్నుఁజేరె
'సోదరినివేదితాకన్య' ♦ సుగుణగణ్య
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య! 89

సీ. రణరంగమున నిరు ♦ ప్రక్క సైన్యములందు
గాయమొందినవారిఁ ♦ గరుణనరయ
స్వాయముగాఁ గృషిచేసి ♦ సభలను నెలకొల్పి
ఖ్యాతి 'నైటింగేలు' ♦ గాంచుటెల్ల
సరకుసేయక మహా ♦ దురితముల్ గావించి
చెఱఁబడ్డపతితుల ♦ చెంతఁజేరి
యుద్బోధన మొనర్చి ♦ యుత్తములుగఁజేసి
'ఎలిజబెత్ ఫ్రై' కీర్తి ♦ నలరుటెల్ల
గీ. ఫ్రాసుంలో దేశభక్తిని ♦ బాదుకొల్పఁ
ప్రాణమిడి 'జోను' యశమును ♦ బడయుటెల్ల
దమమనంబుల నీభక్తి ♦ దనరఁగాదె?
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య! 90

సీ. పాశ్చాత్యదేశానఁ ♦ బ్రభవించియునుగూడ
ప్రాచ్యులమేలుకై ♦ పాటుపడియె
మాంసాశనంబును ♦ మరగియుండియుగూఁడ
కందమూలాశన ♦ కలితయయ్యెఁ
బొలఁతియయ్యునుకూడఁ ♦ బురుషులతోఁబాటు
ప్రతిసంస్థలోఁదన ♦ ప్రతిభఁజూపె
నాస్తికాగ్రణులలో ♦ నామమందియుఁగూడ
నీజ్ఞాన సభకు ని ♦ ర్ణేతయయ్యె
గీ. దేవ! యి 'బ్లానిబీసెంటు' ♦ జీవితమున
జోద్యముగమార్పులెన్నియో ♦ చూపినావు
ఇంక నేవింతచూపఁగా ♦ నెంచినావో ?
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య! 91

సీ. మిసమిసల్ చిమ్మెడు ♦ మెత్తనిపువ్వుల
నీవు మరందంబు ♦ నించినట్లు
ముద్దుపల్కులఁగుల్కు ♦ పద్దెమ్ములను 'మొల్ల'
రామకథామృత ♦ రసమునించె
నారఁబెట్టినయట్టి ♦ యచ్చంపుఁబాలలోఁ
గరళమ్ముసర్పమ్ము ♦ గ్రక్కినట్లు
కదలికావాకపుఁ ♦ గయితలోఁ జెడుకత
మూర్ఖురాలైకూర్చె ♦ "ముద్దుపళని"
గీ. కానఁగాంతురునీదయా ♦ గారమైన
సజ్జనావళిలోపల ♦ సంతతంబు
మొల్లకీర్తిని నపకీర్తి ♦ ముద్దుపళని
సకలకల్యాణగుణధన్య! ♦ సర్వమాన్య! 92

సీ. రామచంద్రునివంటి ♦ రమణునిఁ బెండ్లాడి
కుశలవులనుబోలు ♦ కొడుకులఁగని
పతిభక్తిలోపలఁ ♦ ప్రఖ్యాతిగాంచిన
సతిసీతకైవడి ♦ చరితఁగలిగి
పుట్టినయింటికి ♦ మెట్టినయింటికి
క్షీణింపఁబోని స ♦ త్కీర్తినించి
నీభక్తిలోపల ♦ నిరతంబు నెగడుచు
నానందమునఁదేలి ♦ యాడుకొఱకు
గీ. జననమొసఁగితివనుబుద్ధి ♦ తనకులేక
మానమునుమాని సానిగా ♦ మనెడునట్టి
చానకంటెను శ్వానంబు చాలమేలు
సకలకల్యాణగుణధన్య! ♦ సర్వమాన్య! 93

సీ. నిప్పులఁగురిసెడు ♦ నిండువేసవినైన
వదలకవర్షించు ♦ వాననైన
గజగజవణకించు ♦ కడుశీతముననైన
రేలైనఁ బవలైన ♦ రెంటనైనఁ
గోపించిపైఁబడు ♦ క్రూరునికడనైనఁ
జెడఁదిట్టు నీచుని ♦ చెంతనైన
విధివిరుగడలేని ♦ వృత్తియందేమైన
దేశదేశమ్ములఁ ♦ దిరిగియైనఁ
గీ. గష్టపడిగడియించి రొ ♦ క్కమ్ముదెచ్చి
తన్నుఁబోషించుభర్తకుఁ ♦ దప్పినడచు
సుదతికిహపరసౌఖ్యముల్ ♦ సున్నసున్న
సకలకల్యాణగుణధన్య! ♦ సర్వమాన్య! 94
సీ. కనికడుగారాబ ♦ మునఁబెంచుచుండిన
తల్లిదండ్రుల ప్రాపు ♦ నెల్లవదలి
యాటపాటలఁదను ♦ నలరించుచుండిన
తనదుతోఁబుట్టులం ♦ దఱినివదలి
యిరుగునఁబొరుగున ♦ నెలమితోఁగ్రీడల
సలుపుచుండినయట్టి ♦ సఖులవదలి
పలుమాఱుఁజూచుచుఁ ♦ బలుకరించుచునున్న
మితిలేనిబాంధవ ♦ ప్రతతివదలి
గీ. సర్వమునుభర్తయే యని ♦ శ్రద్ధతోడ
వచ్చికొల్చెడుసాధ్విని ♦ వదలిపెట్టి
కష్టములఁబెట్టువాఁడెపో ♦ కటికవాఁడు
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య! 95



సీ. మానుషజన్మంబు ♦ మాన్యంబుగాఁ జేయఁ
గార్యమ్ములెన్నియో ♦ కలిగియుండఁ
జీట్లాడువారును ♦ జీటికిమాటికిఁ
బోట్లాడువారును ♦ బుడ్లుకొట్టి
కాట్లాడువారును ♦ కనికరమునుమాని
కోళ్ళపందెముఁజూచి ♦ కులుకువారు
వెలలేనివీర్యంబు ♦ వేశ్యలపాల్సేసి
యిల్లాలినింట నే ♦ డ్పించువారు
గీ. స్వర్గమును నరకంబుగ ♦ సలుపువారు
దేవ! వీరినినీవొక ♦ దెబ్బగొట్టి
మంచిమార్గాన బెట్టు నీ ♦ మహిమవలన
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య! 96
సీ. బడలికఁదీర్చెడు ♦ బంధువుగాఁదోఁచి
పిమ్మటఁబీలిచి ♦ పిప్పిచేయు
జిత్తముఁ గావికసింపఁ ♦ జేయునట్లుగుపడి
చేయఁగూడనిపనుల్ ♦ సేయనిచ్చు
నప్పటికప్పుడా ♦ ప్యాయమానంబయి
విపరీతదాహంబు ♦ వెనుకఁగూర్చు
నంతకంతకుమితి ♦ నభివృద్ధికినిదెచ్చి
కొనకుమేరనుమీఱి ♦ కొంపఁదీయుఁ
గీ. బుట్టుకనువ్యర్థపఱచుఁబె ♦ న్భూతమగుచు
నీకుదూరంబుగానుంచు ♦ నీతిఁజెరచుఁ
గానఁద్రాగుడుకంటెను ♦ గలదెకీడు?
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య! 97

సీ. వేర్వేఱురుచులచే ♦ విందులుగొలిపెడు
పలుతెఱంగులమంచి ♦ పండులుండఁ
దలఁచిననోరూరు ♦ తాలింపులకుఁజాలు
గణనకుమీఱు శా ♦ కంబులుండ
దినమొక్కదినుసుగాఁ ♦ దనియింపఁగలమేలు
పలురకంబులపిండి ♦ వంటలుండ
గరగరఁగరఁగిపో ♦ వరుగులువడియాలు
గడుఁజవిగలయూరుఁ ♦ గాయలుండఁ
గీ. బాలుపెరుఁగు సమృద్ధిగాఁ ♦ బరగుచుండ
గనికరముమాని మాంసంబుఁ ♦ దినమరగిన
క్రూరమతి కేడ? నీభక్తి ♦ కుదురు కేడ?
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య!
సీ. తొమ్మిదినెలలు గ ♦ ర్భమ్మునమోచి నొ
ప్పులకోర్చికనెడు ప్ర ♦ భూతమాత
యేతఱిబిడ్డకు ♦ నేమివచ్చునోయని
భీతిల్లు కరుణా స ♦ మేతమాత
మలమూత్రములుమీఁద ♦ సలిపినవిసువక
పోషించునట్టి ప్ర ♦ పూతమాత
తెగులువచ్చినవేళఁ ♦ బొగులుచుమెలకువ
గలిగివర్తించు వి ♦ ఖ్యాతమాత
గీ. పరమపావనగుణగణ ♦ భరితమాత
యట్టిమాతనుసేవించు ♦ నట్టిచేత
నీకుఁగూర్చినచేత లో ♦ కైకమాత!
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య!

సీ. రక్తికుటుంబ భా ♦ రము నెల్ల వహియించి
వారక పనిచేయు ♦ వాఁడు తండ్రి
యింట నెవ్వరి కెప్పు ♦ డేమి కావలసినఁ
బనిపూని తెచ్చెడు ♦ వాఁడు తండ్రి
గృహకార్యములయందు ♦ గృహిణికిఁ దోడ్పడి
వర్తించుచుండెడు ♦ వాఁడు తండ్రి
మందిరమ్మున మహా ♦ నందమ్ము గలుగంగఁ
బరమమైత్రినిఁ గూర్చు ♦ వాఁడు తండ్రి
గీ. వసుధలోఁ దల్లిసరితూఁగు ♦ వాఁడు తండ్రి
అట్టితండ్రిని గొల్వని ♦ యట్టివాఁడు
బ్రతికిచచ్చినవాఁడన ♦ వచ్చుఁ దండ్రి!
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య! 100

సీ. తనజన్మకారకుల్ ♦ తలిదండ్రులగుటను
భావించి వారిని ♦ దేవతలుగఁ
దనతల్లి పేర్వెట్టి ♦ దానధర్మమ్ములఁ
బడఁతులదుఃఖముల్ ♦ పాయఁజేసి
దీనులదైన్యంబు ♦ దీర్పఁగా దనతండ్రి
పేరిడి సత్కార్య ♦ వితతిసలిపి
మాతాపితలనిట్లు ♦ మన్నించి భక్తితో
భవదీయకరుణకుఁ ♦ బాత్రుఁడగుచు
గీ. స్త్రీలుదీనులు దీవెనల్ ♦ చాలనొసఁగ
జననసాఫల్యమొనరించు ♦ కొనెడునట్టి
తనయుఁడొక్కఁడు వంశపా ♦ వనుఁడు చాలు
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య! 101

సీ. సుగుణరత్నంబుల ♦ సుందరహారమై
కులదీపకుండగు కొడుకుకొడుకు
నీతివర్తనమందు ♦ నిరతుండై నిరతంబు
సదుపదేశముసేయు ♦ సఖుఁడుసఖుఁడు
పతినిప్రాణంబుగా ♦ భావించి సేవించి
భక్తితోమెలగెడు ♦ భార్యభార్య
ఆత్మకుసమముగా ♦ నతివనుజూచుచుఁ
బరమమైత్రినిగూర్చు ♦ భర్తభర్త
గీ. సకలమునునీకు నర్పించి ♦ సంతతంబు
నీదునాజ్ఞలఁదలఁదాల్చి ♦ నిష్కళంక
భూరితేజంబుతోఁబొల్చు ♦ బుధుఁడుబుధుఁడు
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య! 102

సీ. సకలవిద్యలలోని ♦ సారంబుగ్రహియించి
సర్వభూతములందు ♦ సమతనుంచి
భావంబుఁగరుణాప్ర ♦ వాహంబుచేనించి
తవిలినీయాజ్ఞనా ♦ దలధరించి
యభిమానమునుగూల్చి ♦ యాగ్రహంబునుగాల్చి
కలుషజాలములెల్లఁ ♦ గడిగివైచి
యందఱిహృదయార ♦ విందమ్ములనుభక్తి
రసమునుగురిపించు ♦ రక్తిమించి
సుగుణమణిహారసూత్రమై ♦ సొంపుగుల్కు
వినయసూత్రంబు ధరియించి ♦ వెలుఁగుచుండు
వాఁడెపోబ్రాహ్మణుండన ♦ వసుధయందు
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య! 103

సీ. దీనరక్షణకళా ♦ దేదీప్యమానుఁడై
విషయభోగాసక్తి ♦ విముఖుఁడగుచు
భూరిదానవినోద ♦ పారిజాతంబయి
క్రూరమహీజకు ♦ ఠారమగుచు
వివిధవిద్యా ద్బృంద ♦ విబుధనాథుండయి
మూఢులపాలికి ♦ మూకయగుచు
భవదీయమహిమాను ♦ వాదనవందియై
పాపులకడరు ద ♦ వాగ్నియగుచు
గీ. భవ్యకరుణోపవీత సం ♦ బద్ధశౌర్య
ఖడ్గభూషణకాంతిచేఁ ♦ గ్రాలుచుండు
వాఁడెపో క్షత్రియుండన ♦ వసుధయందు
సకలకల్యాణ గుణధన్య ! ♦ సర్వమాన్య! 104
సీ. కృషిశిల్పవాణిజ్య ♦ వృత్తుల ధనమును
విరివిగాఁగూరిచి ♦ వృద్ధిఁజేసి
లోభంబు విడనాడి ♦ లోకైకహితకార్య
ములయందు ధారాళ ♦ ముగ నొసంగి
యపరకర్ణుండని ♦ యందఱుఁ బొగడంగఁ
బరమ విఖ్యాతిచేఁ ♦ బరిఢవిల్లి
నీభక్తిలోపల ♦ నిరతంబు మగ్నుఁడై
యానందమునఁదేలి ♦ యాడుచుండి
గీ. క్షమయు సత్యంబు దయయను ♦ సమములైన
మూఁడుపోఁగులు దాలిచి ♦ పొలుచుచుండు
వాఁడెపో వైశ్యరత్నంబు ♦ వసుధయందు
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య! 105

సీ. అవనికి సర్వస ♦ స్యాఢ్యయర్థ నామంబు
సార్థకంబగునట్లు ♦ శ్రమలకోర్చి
సకలధాన్యంబుల ♦ సర్వశాకంబులఁ
బలు తెఱంగుల మంచి ♦ పండ్లనెల్ల
విరివిగాఁ బండించి ♦ సిరులను గడియించి
నీతిమార్గమునందు ♦ నెగడుచుండి
పరిపూర్ణ కరుణతోఁ ♦ బసులను బోషించి
పాడి సమృద్ధిగాఁ బడయుచుండి
గీ. అన్నదాతగ నందఱుఁ ♦ దన్నుఁదలఁచి
దండములుపెట్టునంత యు ♦ ద్దండ భక్తి
తోడఁ బొల్చెడు వాఁడె శూ ♦ ద్రుండనంగ
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య! 10

సీ. నీతిబాహ్యముగాని ♦ నిర్మలవృత్తిని
నెవరుదాల్చిన నేమి ♦ హేయమగునె ?
విద్వాంసులును మఱి ♦ విమలవర్తనులగు
విబుధులుచేపట్టు ♦ వృత్తులెల్ల
వికసించు దేశంబు ♦ విద్యానివాసమై
విరివిగా సిరులచే ♦ విఱ్ఱవీఁగు
దేశస్థులకునెల్ల ♦ దివ్యతేజంబబ్బుఁ
గరము వెలుంగు శ్రీ ♦ భరతమాత
గీ. కాని నీభక్తి గలుగక ♦ కలసిమెలసి
యందఱును నొక్కయనుకూల ♦ మైన మార్గ
మందు వర్తించుటెట్లబ్బు? ♦ నప్రమేయ!
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య! 1

సీ. కన్నులు చల్లని ♦ కాంతులీనుచునుండఁ
బలుకుల నమృతంబు ♦ లొలుకుచుండ
గరుణచే హృదయంబు ♦ గరఁగిపాఱుచునుండ
మోమున శాంతంబు ♦ పొదలుచుండ
హస్తంబు దీనుల ♦ కభయమిచ్చుచునుండ
విజ్ఞానమున బుద్ధి ♦ వెలయుచుండఁ
బొంగిలోపలి భక్తి ♦ పొరలివచ్చుచునుండ
దలమీఁద వినయంబు ♦ గులుకుచుండ
గీ. మించి లోకంబులేల నే ♦ తెంచు యోగి
యోగియగుఁగాక తక్కిన ♦ జోగులెల్ల
యోగులౌదురె? ఋషిహృద్య ♦ యోగివేద్య!
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య! 108
సీ. చాతుర్యముగ నీతిఁ ♦ బ్రీతితోఁ దెలిపిన
యఖిలోపయోగి వే ♦ మన్న యోగి
తత్త్వమ్ముకందగీ ♦ తములందుఁ జెప్పిన
యాత్మానుభోగి వే ♦ మన్న యోగి
తనజీవితమునందు ♦ త్యాగమ్ముఁ జూపిన
యనుపమత్యాగి వే ♦ మన్న యోగి
తను నందఱిలోనఁ ♦ గొనియాడఁ జేసిన
మంత్రప్రయోగి వే ♦ మన్న యోగి
గీ. దేవ. నీభక్తియనియెడి ♦ నావనెక్కి
సూటిగా భవవార్ధిని ♦ దాఁటినట్టి
యమృతలోకానురాగి వే ♦ మన్న యోగి
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య! 109

సీ. కోర్కిమై సంసార ♦ ఘోరమహారణ్య
మందు నీతేజంబు ♦ నొంది చొచ్చి
నిఖిలమూఢాచార ♦ నిబిడాంధకారమ్ము
సరకుసేయక నీతి ♦ సంచరించి
భవదీయభక్తియన్ ♦ పదునైన వాలునఁ
గ్రూరపాపమృగాళిఁ ♦ గూలనడఁచి
సాధుల దీనుల ♦ సంత్రాసములఁ దీర్చి
యాదర్శమూర్తులై ♦ యలరుచుండి
గీ. మఱల నినుఁ జేర వచ్చెదు ♦ మహితమతులు
భూమిలోపల నవతార ♦ పురుషులనఁగ
నక్షయంబైన కీర్తిచే ♦ నమరుచుంద్రు
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య! 110

సీ. ఊషరక్షేత్రమై ♦ యూరక చెడుచుండు
మనమును నందన ♦ వనముఁ జేసి
కఠినకార్యములకుఁ ♦ గడఁగుచుండెడునట్టి
కరముల వరదయా ♦ కరముఁ జేసి
పరుషవాక్యములచేఁ ♦ బతితమావక్త్రంబు
భవ్యవాక్సుధలచే ♦ బాగుఁ జేసి
బుద్ధిని భవదీయ ♦ శుద్ధవిజ్ఞాన తే
జంబుచే భాసమా ♦ నంబుఁ జేసి
యఖిలమును నీదుసేవకై ♦ యప్పగించు
విమలమైనట్టి భక్తిని ♦ నమరఁ జేసి
నెమ్మిరక్షించుభారమ్ము ♦ నీదిసుమ్ము
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య! 111

సీ. దేశభక్తుల మహా ♦ దివ్యచారిత్రముల్
మించినవేడ్క నా ♦ లించుదినము
దీనులయాపదల్ ♦ దీర్పంగ ధనమును
హెచ్చినతమిని వె ♦ చ్చించుదినము
వివిధవిద్యలయందు ♦ విఖ్యాతులగువారి
నెలమి మీఱఁగ గౌర ♦ వించుదినము
బంధుమిత్రాదుల ♦ బాగు నోగును గని
యెంతయుఁ బ్రీతి మ ♦ న్నించుదినము
గీ. నిన్నుఁ గరుణాస్వరూపుని ♦ నిష్కళంక
భక్తితోఁ గొల్చిపొల్చు సౌ ♦ భాగ్యదినము
దిన మగునుగాక తక్కిన ♦ దినము దినమె?
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య! 112
సీ. పూనినసత్కార్య ♦ మును బూర్తిసేయఁగా
నపుడుగల్గెడు నట్టి ♦ హర్షమొకటి
మహనీయుఁడొక్కఁడు ♦ మందిరమ్మును జేరి
నపుడుగల్గెడు నట్టి ♦ హర్షమొకటి
చాలకాలముమీఁద ♦ సఖునిఁజూడఁగ గల్గి
నపుడుగల్గెడు నట్టి ♦ హర్షమొకటి
కలుగక కలుగక ♦ కడకుఁ బుత్త్రుఁడు గల్గి
నపుడుగల్గెడు నట్టి ♦ హర్షమొకటి
గీ. చెప్ప శక్యంబు గాదని ♦ చెప్పుచుంద్రు
గాని నినుఁ గన్నసమయానఁ ♦ గలుగునట్టి
హర్షమున కెద్దిసాటి? స ♦ ర్వర్షివినుత!
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య! 113

సీ. లోకబాంధవుఁడని ♦ లోకమెన్నఁగ దీన
లోకంబుఁగాచు సు ♦ శ్లోకుఁ డగుచు
మిత్రుఁ డీతండని ♦ మించుకూరిమితోడ
బుధులుమెచ్చెడు పుణ్య ♦ పురుషుఁడగుచు
శ్రీపీఠికాపురీ ♦ సింహాసనంబను
పూర్వాద్రిఁబొల్చు స ♦ న్మార్తియగుచు
భవదీయ భక్తి ప్ర ♦ భాభాసమానుఁడై
రాజిల్లు శ్రీసూర్య ♦ రావుప్రభువు
గీ. ఆయురారోగ్యపుత్ర పౌ ♦ త్రాభివృద్ధి
సకలసంపత్సమృద్ధియు ♦ శాంతిఁ గల్గి
ప్రబలుఁ గావుత నీకృపా ♦ పటిమచేత
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య! 114
సీ. దంపతు లన్యోన్య ♦ ధర్మముల్ రక్షించి
యురుసుఖాబ్ధిని దేలు ♦ చుండ్రుగాక
ప్రజలు రాజును పర ♦ స్పరము ప్రేమించుచు
మితిలేని శుభముల ♦ మింత్రుగాక
మిత్రులు పరిశుద్ధ ♦ మైత్రితో వర్తిల్లి
కలకాలమునుగీర్తిఁ ♦ గాంత్రుగాక
జనకులు సంతాన ♦ మును బాడిఁ గాపాడి
కులపావనము చేసి ♦ కొండ్రుగాక
గీ. అందఱును గూడి నిన్ను నా ♦ నందమయుని
భక్తిఁ గొల్చుచు సంతోష ♦ భరితులగుచు
పృథ్విఁనేస్వర్గభూమి గా ♦ వింత్రుగాక
సకలకల్యాణ గుణధన్య! ♦ సర్వమాన్య 115

శ్రీ

# లోకపావనశతకము.



ఉ. శ్రీరమణీయమూర్తి వయి ♦ శిష్టముముక్షుజనానువర్తివై
చారువిశాలకీర్తి వయి ♦ సర్వమునీంద్ర హృదబ్జవర్తివై
గూరిమి మీఱఁగా భువన ♦ కోటుల నేలెడు చక్రవర్తివై
సారెకు వెల్గుచుండుదువు ♦ సజ్జనజీవన! లోకపావనా! 1

ఉ. చంపకమాలికల్ మఱియుఁ♦జక్కనియుత్పలమాలికల్ గడుఁ
బెంపులు గుల్కనొక్కకృతిఁ♦జొక్కఁపుభక్తి నిగూర్చి నీకిఁదే
యింపుగ నప్పగింతుఁబర♦మేశదయన్ గయికొమ్ము రమ్మునా
సంపదయెల్ల నీవె కద ♦ సజ్జనజీవన! లోకపావనా! 2

ఉ. శ్రీకరము న్విచిత్రమగు ♦ సృష్టినొనర్చి చెలంగు నీదు శో
భాకృతి యోగిరాడ్తతి స ♦ మంచితరీతి సమాధిఁజూచి నిన్
నాకధునీప్రవాహముల ♦ న వ్వేడు వాగ్ఝరుల న్నుతించు నీ
శా! కవిలోకమూలధన! ♦ సజ్జనజీవన! లోకపావనా! 3

చ. నిరతము నీవినోదములె ♦ నిర్మలబుద్ధికిఁ దోఁచుచుండుటన్
నిరుపమగీతజాతముల ♦ నీగుణగానముఁ జేయు చాత్మలో
గురియగునిన్నుఁగాంచిఋషి♦కూటముగంతులువైచియాడెడిన్
సరసమనోహరా! సకల ♦ సజ్జనజీవన! లోకపావనా! 4

ఉ. ఆశ నిరాశయౌ తటిని ♦ నద్భుతరీతిని నాస గొల్పు స
ర్వేశ! భవద్విచిత్రముల ♦ నెల్లను జూచి మునీంద్రులందఱా
వేశముచేత నీయశము ♦ వింతగఁ బాడి సుఖించుచుందు రీ
శా! శరణాగతాభయద! ♦ సజ్జనజీవన! లోకపావనా! 5

చ. తమగతిఁదప్పకుండఁగన ♦ దా గ్రహణంబులుధూమకేతువుల్
క్రమముగఁ దోచుచుండుటను ♦ గాంచిబుధుల్ గడుఁజోద్య
[మందుచుఁ
భ్రమదము మీఱనీనియమ ♦ పాళిని బాడుచునుంద్రుభక్తితో
శమదమభూషితాత్ములయి ♦ సజ్జనజీవన! లోకపావనా! 6

ఉ. ఆకసమందుఁ బక్షికుల ♦ మందముగా విహరించునట్టు లీ
లోకచయమ్ము నీకడుపు ♦ లోపుల వింతగ సంచరించుచుఁ
వాకొనుచుండు నీమహిమ♦వారక యెప్పుడు వేయినోళ్లతోఁ
జౌకగఁ జెప్పనౌనె నిను ♦ సజ్జనజీవన! లోకపావనా. 7

ఉ. చల్లని కీర్తిచంద్రికలఁ ♦ జల్లుచు లోకము లేలు మన్మనో
వల్లభ! నీప్రభావమునఁ ♦ బాపచయంబుల నెల్లద్రుంచి వ
ర్ధిల్లుచు భక్తిభావమున ♦ దివ్యతరస్తుతి పుష్పమంజరుల్
చల్లగనియ్యవే సకల ♦ సజ్జనజీవన! లోకపావనా! 8

ఉ. అందఱు స్వేచ్ఛమీఱఁగవి ♦ హారముసల్పెడు నందనంబుగా
సుందరమైనయీధరను ♦ సూరులు మెచ్చ రచించినావు నీ
యందము చందమిందుఁగని ♦ హర్షసుధాంబుధిఁ దేలిమేమునీ
సాంద్రయశంబుఁ బాడుటకు ♦ సజ్జనజీవన! లోకపావనా! 9

ఉ. అణువునకంటెసూక్ష్ముఁడవె ♦ యంతట నెట్లులునిండినావు? మా
కనులకుఁగానరావెపలు ♦ కాంతులఁ జిమ్ముదుసూర్యకోటులఁ
ఘనమతి! యెట్లుచేసితివి! ♦ గాంచగ నీపనులెల్లవింతలౌ
ఘనకనకాంగవాగినుత! ♦ సజ్జనజీవన! లోకపావనా. 10

ఉ. చందురు శైత్యమెంతమఱి ♦ సంద్రములోపలి లోఁతదెంత పే
రొందిన గ్రీష్మభానుని స ♦ ముజ్జ్వలభీష్మప్రతాప మెంత నీ
యందలి సీతు లోఁతులకు ♦ నారని వేఁడికి ముందు విస్ఫుర
త్సాంద్రయశోమహావిభవ! ♦ సజ్జనజీవన! లోకపావనా! 11

ఉ. నీవొకసారి ఢుర్కోఁ అనిన ♦ నీరధు లెల్లఁగలంగిపారెడున్
దావకృశాను డెంతయును ♦ దర్పము మీఱజగంబుఁగాల్చెడున్
భూవలయంబు చూర్ణమయి ♦ పోవఁగవీచును జండవాతముల్
స్థావర మెల్లరూపడఁగు ♦ సజ్జనజీవన! లోకపావనా! 12

చ. నను నిటు గట్టిపెట్టితివి ♦ నాబలమెల్లను గ్రుంగిపోయెడిన్
దినములవెన్ని నేనిటులు ♦ దీనుఁడనై పడియుందుఁ జెప్పవే
యని మొఱనీకుబెట్టెడి క్రి ♦ యన్ గడుఘోషిలుసంద్రమెప్పుడున్
సనియమశక్తిసంభరణ! ♦ సజ్జనజీవన! లోకపావనా! 13

ఉ. భూతములన్ వరాశ్వములఁ ♦ బొందికతోనొడగూర్చి లోకమున్
ఖ్యాతరథంబు నీవుగడఁ ♦ కన్నడిపింపఁగ మేముహాయిగా
భీతిని మాని నీకృపకు ♦ భృత్యులమై సుఖమున్నవారమీ
శా! త్రిజగన్నుతైకయశ! ♦ సజ్జనజీవన! లోకపావనా! 14

ఉ. పిల్లలుమేము నీకృపను ♦ బెల్లుగ నాటల నాఁడు కొంటకై
యెల్ల పదార్థములు గలుగు ♦ నిల్లుగ భూమినలంకరించి మా
యుల్లముపల్లవించునటు లొప్పగవింతలఁజూపుచుందువో
సల్లలితప్రశస్తగుణ! ♦ సజ్జనజీవన! లోకపావనా! 15

ఉ. బాలురమయ్య మేము మరి ♦ పాఠము సెప్పఁగురుండవీవు నీ
పాలితమైనలోక మిది ♦ భవ్యతరం బగు పాఠశాల వే
యేలభవత్ప్రబోధమున ♦ సిద్ధచరిత్రుల మౌదు మయ్యయీ
శా! లలితప్రభాకలిత! ♦ సజ్జనజీవన! లోకపావనా! 16

ఉ. ఎల్లఱ నీవుగర్భమున ♦ నెల్లపుడుం వహించియుండుటం
గొల్లగభోజ్యవస్తువులఁ ♦ గూరిమితోనొడగూర్చుచుండుటం
బెల్లుగ నీకృప న్బ్రదివి ♦ పీడని యోపికఁ బెంచుచుండుటం
జల్లని తల్లివీవెకద! ♦ సజ్జనజీవన! లోకపావనా! 17

ఉ. అందఱుమమ్ముపీడిచను ♦ నప్పుడుమావెనువెంటనుండి మా
డెందములోని కుందులను ♦ డిందగఁజేసి కడింది ప్రేమతో
ముందునువెన్కఁదోడగుచు ♦ మోదముఁగూర్చెడుమిత్రుఁడీవెగా
చందనశీతలా! విమల! ♦ సజ్జనజీవన! లోకపావనా! 18

చ. అకలుష! భక్తవత్సల! దయామయ! నీవు భవాబ్ధిపోతమై
ప్రకట జగత్త్రయంబునకు ♦ బంధువునై పరమోపకారివై
త్రికరణ శుద్ధిగాఁ గొలుచు ♦ ధీధులకుం గడుదోడునీడవై
సకలమున న్వెలింగెదవు ♦ సజ్జనజీవన! లోకపావనా! 19

ఉ. సర్వమునీదయంగలుగు ♦ నంగతిభక్తుఁడెఱుంగుఁ గానఁదా
గర్వము మాని సర్వమును ♦ గాన్కగనీకునొసంగియాత్మలోఁ
బర్వినవేడ్కనుత్సవముఁ ♦ బాయకసల్పుచునుండునిత్యముం
సర్వశుభప్రదా! సకల ♦ సజ్జనజీవన! లోకపావనా! 20

ఉ. సంతత మంత రంగమున ♦ సత్యపథంబునుజాటిచూపుచుం
వింతగనంతయుం దెలిసి ♦ వేయివిధంబులఁ బ్రీతిఁబ్రోచుచుం
బంతముతోడనందఱను ♦ బట్టిసుమార్గమునందెపెట్టుచుం
సంతస మందుఁదేల్చెదవు ♦ సజ్జనజీవన! లోకపావనా! 21

ఉ. సత్యమునీస్వరూపమని ♦ స్వాంతములోఁ దలఁపోసినిత్యముం
సత్యవచోవిహారమున ♦ సర్వమునర్పణసేయునట్టియా
సత్యప్రతాపశీలుర ప్ర ♦ శాంతమనస్కులసత్యకీర్తికిం
సత్యము నీవె కారణము ♦ సజ్జనజీవన! లోకపావనా! 22

చ. దురితములొక్కటంబయికి ♦ దూఁకగ నెంచినయప్పుడాత్మలోఁ
బరుపముపూని యన్నిటిని ♦ బారగఁ దోలెడుశక్తినీదుసం
స్మరణముచేతఁ గల్గునిది ♦ సత్యముసత్యము సత్యమంచునిన్
స్మరణముచేసి చెప్పఁగల ♦ సజ్జనజీవన! లోకపావనా! 23

చ. పరమకృపాళు వౌకతనఁ ♦ బాపదవాగ్నినిగ్రాగు వారలన్
గర మనురక్తి నెత్తికడఁ ♦ కన్గరుణాయత వీక్షమాలికల్
బఱపి ప్రశాంతచిత్తులుగ ♦ భాసిలఁజేయుచు నుందువారనీ
శరణమె శాంతికారణము ♦ సజ్జనజీవన! లోకపావనా! 24

చ. దురిత దవాగ్ని దూఁకితిని ♦ దుఃఖపరంపరలందుఁ గ్రాగితిన్
దరిగనరాక కుందితిని ♦ దర్పముఁదక్కితినీకుమ్రొక్కితిన్
గురిసిభవత్కృపామృతము ♦ గొబ్బున శాంతినిగూర్ప వేఁడితిన్
శరణముచొచ్చితిన్ వినుము ♦ సజ్జనజీవన! లోకపావనా! 25

చ. మనసునుజొచ్చి చూచెదవు ♦ మాటలచే నినుమోసపుచ్చగా
ననువగునేపరాత్పర! స ♦ మంచితచారుచరిత్రనీకునా
మనసునువిప్పిచూపెదను ♦ మానక నన్నుఁగృతార్థుఁజేయ వే
చనవున నిన్నె చేరితిని ♦ సజ్జనజీవన! లోకపావనా! 26

ఉ. మీఱితి నీదు నాజ్ఞలను ♦ మేలును గీడును నెంచ కెంతయున్
జాఱితిఁ బాపకూపమున ♦ జన్మము దుఃఖము పాలుసేసితిన్
జీరితిఁ గావు కావుమని ♦ చేతులు మోడ్చితి దీనుఁడైతి వే
సారితి నింక నీవెగతి ♦ సజ్జనజీవన! లోకపావనా! 27

చ. అతుల విచిత్ర లోకముల ♦ నద్భుతరీతి సృజించి ప్రోచునీ
ప్రతిభకు నన్నుఁగాచుటొక ♦ భారమెయొకరుణాసుధానిధీ!
మతినిను నెంచినంతటనె ♦ మానివెతల్, సుఖియించు నెంతయున్
సతతము నీవె నాకు గతి ♦ సజ్జనజీవన! లోకపావనా! 28

ఉ. చింతలుపైఁబయిఁ బొదివి ♦ చెచ్చెరఁగీలలఁబొఱెనంటినన్
బంతముతో రుజావళలు ♦ పట్టిపొరింబొరి బెట్టుఁదాఁకినన్
వింతఁగ శాంతమై మఱలు ♦ విశ్వభుండగునీ స్మరించినన్
శాంతినికేతనా! సకల ♦ సజ్జనజీవన! లోకపావనా! 30

ఉ. ఘోరవిపత్సముద్రమునఁ ♦ గూలినవారికి నీకటాక్షమే
పారముఁ జేర్చునావకద ♦ భక్తచకోరకపాళికిన్సదా
పారణపూర్ణచంద్రికయుఁ ♦ బాపవిమోచనధారయుంగదా
చారుకృపాసుధాసదన! ♦ సజ్జనజీవన! లోకపావనా! 30

ఉ. భూతలమందుఁ బ్రాణులను ♦ భూరివిపద్దశ నొందజేయుచున్
ఘాతుకులై మెలంగు నప ♦ కారవిహారుల నీతిదూరులన్
బ్రాతిగ శిక్షసేయునెడ ♦ భవ్యతరంబగు నీకటాక్షమే
శాతకృపాణమై తనరు ♦ సజ్జనజీవన! లోకపావనా! 31

చ. నిరతమునీదయామృతము ♦ నిండిజగంబునఁబర్వుచుండియున్
దురితమునన్ బ్రవర్తులగు ♦ దుష్టుల బుద్ధికిగోచరించునే?
మఱిమఱిఁబైపయిన్ గవియు♦మంటగఁదాఁగనుపించుఁగాకయీ
శ్వర! సుఖాపూర! పాపహర!♦సజ్జనజీవన! లోకపావనా! 32

ఉ. సారెకుఁబాపపంకమున ♦ జారెడుమూర్ఖులమమ్ము నెత్తుచున్
దీరనిప్రేమతోఁ దుడిచి ♦ దిద్దుచునుందువు, కొంచమైనవే
సారవు, నీక్షమాగుణము ♦ సన్నుతిసేయఁగ మాకుశక్యమే?
చారుకృపామహాభరణ! ♦ సజ్జనజీవన! లోకపావనా! 33

ఉ. నీకరుణావలోకనము ♦ నిల్చియ దెవ్వనిమీఁదఁ బొల్చునోఁ
లోకము లెల్ల నాతనికి ♦ లొగ్గి నమస్కృతి సేయు, నాతఁడు
స్తోకమనీషతో వెలుఁగు, ♦ దోఁగుచునుండుసుఖాబ్ధిలోన, నీ
శా! కరుణానివేశయశ! ♦ సజ్జనజీవన! లోకపావనా!

చ. దయహృదయాంబరస్థలిని ♦ దద్దయుబూర్ణసుధాంశుమించెడు
న్దయహృదయాంబుజాతమునఁ ♦ దన్మకరందముగా స్రవించెదున్
దయహృదయాభ్రసంజనిత ♦ ధన్యతమామృతవృష్టియైచనున్
స్వయమది నీగుణంబగుట ♦ సజ్జనజీవన! లోకపావనా! 35

ఉ. శిష్టులసద్గుణం బనెడు ♦ చెన్ను పసిండి మెఱుంగు దేరఁగాఁ
గష్టము వెట్టి రాచెదవు ♦ కానఁగ లేరుగ నీప్రభావముల్
నష్టమతుల్ ప్రపంచమున ♦ నాథ. భవత్కరుణావిశేషముల్
స్పష్టములౌను సాధులకె ♦ సజ్జనజీవన! లోకపావనా! 36

చ. తరిచినకొద్ది వెన్న దధిఁ ♦ దగ్గును గాని జగంబులోనినున్
దరచినకొద్ది నీకరుణ ♦ తద్దయు వర్ధిలి కానుపించు, నిన్
దఱుగనివాని నెవ్వఁడు స ♦ దామదిఁగొల్చునో, వాఁడెధన్యుఁడై
సరగున ముక్తిఁజూఱఁగొను ♦ సజ్జనజీవన! లోకపావనా!37

ఉ. సృష్టిని జూచి, నీమహిమ ♦ చిత్తములోఁ దలపోసిపోసి, నీ
కిష్టము లేనివానికడ ♦ కింతయుఁ బోవక ద్రోసిత్రోసి, యే
కష్టము వచ్చినన్ విడక ♦ గ్రక్కున నీపని చేసి చేసి, నిన్
స్పష్టముగాఁ గనంగ నగు ♦ సజ్జనజీవన! లోకపావనా! 38

చ. పదలక నీవు సర్వమున ♦ వ్యాపకుఁడై విలసిల్లినావు; నీ
యుదరమునందు సర్వముమ ♦ హోత్తమరీతి వసించునైన స
మ్మదమునభక్తులందఱును ♦ బూతచరిత్రునిబూజ్యునిన్ను హృ
త్సదనములం దెచూచెదరు ♦ సజ్జనజీవన! లోకపావనా! 39

ఉ. చిత్రవిచిత్రయంత్రములఁ ♦ జెన్నలరారెడు దేహయంత్రమున్
బుత్రులమంచుమాకుఁబరి ♦ పూర్ణదయన్ దయచేసినావు; నీ
చిత్రము లెల్లఁ జూచినను ♦ జిత్తములోఁగనిపొంగికొల్వ, నీ
శా! త్రిజగత్ప్రకాశయశ! ♦ సజ్జనజీవన! లోకపావనా. 40

చ. రవికినిఁజుట్టుభూమియును♦ రమ్యముగాభువిచుట్టుఁ జంద్రుఁడుఁన్
భువి తనచుట్టుఁదాఁ దిరిగి ♦ పొల్పుగ వత్సర మాసవాసరా
లవనిని గల్గఁజేయును మ ♦ హాద్భుతరీతిని నీదు శాసన
స్తవమొనరించుచున్ సతము♦సజ్జనజీవన! లోకపావనా! 41

ఉ. వింతగభూవిమానమున ♦ విశ్వవిభూ! మముఁనుంచిమింటిపై
నెంతయువేడ్కఁద్రిప్పెదవ♦దేమివిచిత్రమో? త్రిప్పినట్టులొ
క్కింతయుఁగానరాదహహ!♦యెన్నఁదరంబెభవత్ప్రభావముల్
సంతతసౌఖ్యహేతువులు♦సజ్జనజీవన! లోకపావనా! 42

ఉ. ఆకసమున్ బటంబునమ♦హాద్భుతరీతి మహేంద్ర చాపమున్
శ్రీకమనీయవర్ణములఁ ♦ జిత్రతరంబుగ తెప్పపాటులో
నే కలిగించి చూపెద వ♦దెంతటిచిత్రపు వ్రాతకాఁడ వీ
శా! కమనీయశుభ్రయశ! ♦ సజ్జనజీవన! లోకపావనా! 43

చ. రవి దివి వచ్చి పోవుతఱి ♦ రాజిలు చిత్రపటంబులోయనన్
బ్రవిమలకాంతులీనెడుప్ర♦భాతరుచుల్ మఱిసాంధ్యరాగముల్
దవిలి నభోంగనామణి స♦దానినుఁగూర్చి రచించివ్రాయుసం
స్తవకవితాప్రభావములు♦సజ్జనజీవన! లోకపావనా! 44

ఉ. వారిధిలోని నీరమును ♦ బాష్పవిధంబునఁ బీల్చి దానినే
వారక వారిదాకృతిగ ♦ వర్ధిలఁజేసి సువృష్టి భూములం
జారుతరంబుగాఁగురుపు♦చక్కనియంత్రము భాస్కరుండునిన్
సారెకుఁజాటుచుండెడిని ♦ సజ్జనజీవన! లోకపావనా! 45

ఉ. చీఁకటిఁజిమ్మనీ వడరి ♦ జెంగు ఫిరంగి గడంగి కాల్చినన్
బ్రాకటమైన తెల్లపొగ ♦ పర్వెననంగను బూర్వదిక్కునన్
వేకువఁ దెల్లవాఱు రవి ♦ బింబము వచ్చును గుండుభాతి నీ
శా! కమనీయభూరియశ! ♦ సజ్జనజీవన! లోకపావనా! 46

ఉ. లెండని, మీఁదఁ జేవయిచి ♦ లీలగఁ జూచెదుమాడ్కిఁ దోఁపఁగా
నండజముల్ రొద ల్సలుపు, ♦ హాయిగఁ జల్లనిగాలివీచుమా
ర్తాండునిరశ్మి పైఁబయిని ♦ దద్దయుఁబర్వఁ, బ్రభాతవేళ నీ
చండతరప్రభావమున ♦ సజ్జనజీవన! లోకపావనా! 47

చ. ఉదయమునందు లేచి నిను ♦ నుజ్జ్వల భక్తి భజించువారికిన్
హృదయముసద్గుణంబులకు ♦ నెంతయు నాకరమై చెలంగెడున్
మదముఖదుర్గుణావళులు ♦ మ్రందినిరంతరశాంతియబ్బెడున్
సదమలశాసనా! సకల ♦ సజ్జనజీవన! లోకపావనా! 48

ఉ. పెల్లుగ వెల్లువేవెలుఁగు వేఁడికిమందుగఁ గంటి విందుగాఁ
జల్లగఁబైపయిన్ సుధలఁ ♦ జల్లెడుపున్నమనాఁటినిండు జా
బిల్లి సృజించి నీకుఁగల ♦ ప్రేమకు సూచనఁ జూపి తౌర! నీ
చల్లఁదనంబ దెంతటిదొ? ♦ సజ్జనజీవన! లోకపావనా! 49

ఉ. జల్లునఁగీర్తినీపయినఁ ♦ జల్లిన మల్లెలో! నీజయోత్సవం
బెల్లడఁజాటుదీపములొ? ♦ యీశ్వర! నీదు విలోకనంబులో!
కొల్లఁగమింటఁజుక్కలనఁ ♦ గోట్లకొలంది వెలుంగులోకముల్
సల్లలితప్రభావిభవ! ♦ సజ్జనజీవన! లోకపావనా! 50

ఉ. సూర్యుడునీకుముందు నెఱ ♦ సున్నప్రతాపమునందుజంద్రుఁడో
స్థైర్యముపూని చెప్పుటకుఁ ♦ జాలఁడుదానర సున్నొసున్నయో
వీర్యయశంబులందు నర ♦ విందముబిందులఁ దెల్పుఁ జెల్వులో
శౌర్యముఁ జూఁపజాల నని ♦ సజ్జనజీవన! లోకపావనా! 51

ఉ. ధారుణిమీఁద భాస్కరుఁడు ♦ దారుణరశ్ములు వెలుఁజిమ్మినన్
గూరుచు శాంతిమేఘములు ♦ గూరిమిఁగోట్లకొలందిచిన్కులన్
సారెకు నీప్రభావమున ♦ సర్వదయాపర! భక్తకింకరా!
చారుపవిత్రసచ్చరిత! ♦ సజ్జనజీవన! లోకపావనా! 52

చ. ఖరకరుఁడెంతతీక్ష్ణముగఁ ♦ గన్నులకున్ మిఱుమిట్లు గొల్పినన్
శిరమునొకింతయెత్తికడుఁ ♦ జెన్నగుపచ్చనియాకుజొంపమున్
సరగునఁజూడ నేత్రములు ♦ శాంతి సుధాంబుధినోలలాడు నీ
శరణము చొచ్చువారివలె ♦ సజ్జనజీవన! లోకపావనా! 53

ఉ. నీదగుసృష్టి చిత్రములు ♦ నెమ్మిగనందగు చారుసౌధముల్
ఖేదముమాపుగంధవహు ♦ క్రీడకుఁజాలిన రమ్యరంగముల్
మోదముగూర్చువాహినుల ♦ మూలపదంబులుభూరిశైలముల్
సాదరముల్ భవత్కృతులు ♦ సజ్జనజీవన! లోకపావనా. 54

ఉ. భూమికి సారమున్ గొలిపి ♦ పూతశరీరులఁ జేసి స్నాతులన్
ప్రేమను జీవకోటులకుఁ ♦ బెల్లుగ జీవనమిచ్చి నీదయా
స్తోమముగల్గవెల్వరిసి ♦ తోయధిఁగూడెడు నమ్మహానదుల్
స్వామి! భవద్యశోలతలు ♦ సజ్జనజీవన! లోకపావనా! 55

చ. తగువిగతావరోధమునఁ ♦ దద్దయుస్వేచ్ఛ మెలంగుఁ గావునన్
మృగములుపక్షులున్ మరిస ♦ రీసృపముల్ ఫలపుష్పవృక్షముల్
సొగసుగఁజాటు నీప్రభలు ♦ సుందరబంధురమౌ మహాటవిన్
స్వగతస్వతంత్రసౌఖ్యమున ♦ సజ్జనజీవన! లోకపావనా. 56

ఉ. ఇమ్ముగ లేఁజిగుళ్లెసవి ♦ యింపుగఁగూసెడు కోకిలావళుల్
ప్రమ్మినప్రేమఁబండ్లఁదిని ♦ పల్కులముద్దులుచిల్కచిల్కలున్
గమ్మనితేనెనానుచు సు ♦ కమ్ముగఝుమ్మని పాడుతుమ్మెదల్
సమ్మతితో నినున్ బొగడు ♦ సజ్జనజీవన! లోకపావనా! 57

ఉ. తీయని తేనె నానుటకుఁ ♦ దేంట్లకుఁ బూల నొసంగి, కోకిలల్
మేయఁగఁ లేఁ జిగుళ్ళనిడి, ♦ మించుతమిన్ దిన దోరగాయలన్
బాయని ప్రేమఁ జిల్కలకుఁ, ♦ బండ్లను మాకొదవించి, మావినీ
చాయ నొకింత చూపెడిని ♦ సజ్జనజీవన! లోకపావనా! 58

చ. పనసకుఁ బూవులు లేవు; మఱి ♦ పండులు మల్లెకు లేవు, క్రోటనుల్
ననలనుఁ బండ్లనీవు; కరు ♦ ణామయ! మామిడిపూల బండ్లతోఁ
వనరుచునుండుఁ జోద్యము గ ♦ దా! భవదీయవిచిత్రసృష్టి యే
జనుఁడు నుతింపఁగాఁ గలఁడు? ♦ సజ్జనజీవన! లోకపావనా! 59

చ. అలరులు పండ్లు క్రోటనుల ♦ యందు దయింపని లోటుఁ బాపఁగా
విలసదనంతవర్ణముల ♦ వెల్గెడు నాకులు వానియందు సం
కలితము చేసి చిత్రముగఁ ♦ గన్నుల విందొనరించినావు; నీ
సలలితసృష్టి వింత గద! ♦ సజ్జనజీవన! లోకపావనా! 60

చ. ఋతువున కొక్కపూవె తన ♦ యింపును సొంపును జూపుచుండగా
సతతము నొక్క తీరున వ ♦ సంతము సేయు గులాబిగావునన్
బ్రతికవి దీనిఁ బువ్వులకు ♦ రాణిగఁ జెప్పుచు నీయశంబు నే
సతమును జాటుచుండెడిని ♦ సజ్జనజీవన. లోకపావనా. 61

ఉ. మెత్తనిచిత్తముం గలిగి ♦ మేల్మకరందముఁ బోలు భోజనం
బుత్తమ మాచ కాళికిడి ♦ యార్జితమా ఘనకీర్తి సౌరభం
బొత్తుగ దిక్కులన్నెఱపు ♦ యోగ్యుఁడెనీదగు భక్తుఁడంచుఁదా
సత్తెమె చాటుఁ బుష్పమిల ♦ సజ్జనజీవన! లోకపావనా! 62

ఉ. మల్లెలు నీవిలాసమును ♦ మాటికిఁ జాటుట చేతనే కదా
చల్లగఁ గంటికద్దుకొని ♦ చానలు వేసవి వానిఁ దాల్చుటల్
మల్లెల గావ వేవయిన ♦ మన్ననఁ జెందునె నిన్ను వీడి? భా
స్వల్లలితప్రభావిసర. ♦ సజ్జనజీవన. లోకపావనా! 63

ఉ. నీవిధి దాఁటువారలకు ♦ నేరుపుమీఱ ననేకరోగముల్
నీవు సృజించియుణ్ మఱల ♦ నీదగుకూరిమి పేర్మిలోడ నా
నావిధులన్ బ్రతిక్రియలు ♦ నాథ మహౌషధులందుఁగూర్చితౌ
స్థావరసత్కృపాభరణ ♦ సజ్జనజీవన! లోకపావనా 64

చ. పఱచెడువానిపైఁ బడక ♦ పట్టుకుఁజిక్కని వానిజోలికిన్
బఱవక క్షుత్తులేని తఱి ♦ వన్యమృగంబుల జాడఁబోక భీ
కరత గభీరతన్ గలిగి ♦ కాననసీమలనేలుచుండు కే
సరిని సృజించినావు గద ♦ సజ్జనజీవన! లోకపావనా! 65

చ. తమతమజట్టు వీడని వి ♦ ధంబునజంతులనాజ్ఞఁ బెట్టగా
సమదమృగోత్కరంబులను ♦ సంసృతిలో సృజియించినావు నీ
క్రమమును దప్పువాని కిల ♦ గట్టిగముప్పు ఘటిల్లితీరెడున్
సమధిక దుష్టనిగ్రహణ! ♦ సజ్జనజీవన! లోకపావనా 66

ఉ. కాకము కావుకావుమని ♦ కర్ణకఠోరముగాఁగ గూసినన్
వేఁకువ దెల్పదే? మఱియు ♦ వేయివిధంబులఁ దన్ను దెప్పనా
కోకిలఁ బెంపదే భువిని? ♦ గుందులకున్ సుగుణాళిఁగూర్చియీ
శా! కృపఁజూపినావుగద ♦ సజ్జనజీవన! లోకపావనా! 67

చ. అతులిత శేముషీగరిమ ♦ నద్భుతమై తనరార్తగూడునం
చితగతిఁ గట్టుచుండుటను ♦ శిల్పిగణంబులు భూమిలోపలన్
బతఁగుల శిల్పిరాజనుచు ♦ బంగరుపిచ్చుకఁ బిల్చు టెల్ల నీ
చతురతచేతఁగ దైగద ♦ సజ్జనజీవన! లోకపావనా! 68

ఉ. పక్షము లెప్పుడున్ మెఱుఁగు ♦ బాయనిరీతిని రాచిదువ్వకోన్
బక్షికిఁబుచ్చుకోశమున ♦ భవ్యతరంబుగ మంచితైలమున్
రక్షణచేసి దువ్వెనగ ♦ రాజిలు ముక్కును నీదుకూర్మికిన్
సాక్షిగనిచ్చినావుగద ♦ సజ్జనజీవన! లోకపావనా 69

ఉ. పాపముచేత బుద్ధి చెడి ♦ పావన! నీపొడఁజూడ నోడు నా
పాపినిబోల్చి చెప్పుటకు ♦ భానునిఁజూడఁగ నోడు గూబలన్
జూపితి వౌర లోకమున ♦ శుభ్రయశోవిభవాభిరామ! సం
స్థాపితసర్వధర్మపథ! ♦ సజ్జనజీవన! లోకపావనా! 70

ఉ. పీల్చి ప్రాణవాయువును ♦ బెల్లుగమే మిడు దుష్టవాతమున్
గ్రోలుచుమంచిగాలినొడ ♦ గూర్చుచునుండెడువృక్షజాలముల్
చాల సృజియించినీమహిమఁ ♦ జాటితి వౌర! జగంబులోపలన్
జాలు నెవండు నిన్బొగడ ♦ సజ్జనజీవన! లోకపావనా! 71

ఉ. అన్నిటికంటెముఖ్యముగ ♦ నాదరువై తనరారి యందఱన్
గ్రన్ననఁగాచుచుండునది ♦ గాలిగదా యనిదాని నెల్లెడన్
బన్నులు రాజు లెవ్వరును ♦ బన్ననిరీతిని నించినావు నిన్
సన్నుతిసేయఁగాఁ దరమె? ♦ సజ్జనజీవన! లోకపావనా 72

ఉ. ధాటిగఁబ్రాణికోటులిల ♦ దాహముదీర్చుకొనంగఁ బ్రావృషా
నీటిని దేటఁజేయుటకు ♦ నేరుపుమీఱఁగ మీనయంత్రముల్
కోటులకొద్దిఁ జేసితివి ♦ కూరిమిలోపల నీకు నెవ్వరున్
సాటియె విశ్వసంభరణ! సజ్జనజీవన! లోకపావనా! 73

చ. పసిఁడిఁ జేయఁగానరులు ♦ భస్మములున్ రసముల్ఘటించినన్
బసిడికిఁగాక పెక్కుపని ♦ పాటలకున్ ఫలకారియౌచు నీ
యసమకృపావిలాసముల ♦ నంతటఁజాటెను లోకమందు నీ
జసమె వెలుంగుఁగా సకల ♦ సజ్జనజీవన లోకపావనా! 74

ఉ. పిల్లలు దొర్లుచున్నడుచుఁ ♦ బెల్లుగ నాడుదురంచువారిలోఁ
బల్లవకోమలంబు లన ♦ ప్రాయములో నెముకల్ ఘటించియో
వల్లభ యెల్లరుం దెలియు ♦ వైఖరిఁ జక్కఁగఁ జాటితౌర! నీ
సల్లలితార్ద్రచిత్తమును ♦ సజ్జనజీవన! లోకపావనా! 75

ఉ. వెన్నునఁ గాలుమోపి కరి ♦ వెళ్ళిన వెంటనె యెంతో వింతగాఁ
దిన్నగఁ జీమ దెప్పిరిలి ♦ తేకువఁ దెన్నునుబట్టి పోయెదుర్
బిన్నల నెల్ల నెంతయును ♦ ప్రేమ భరింతువు చిత్రరీతినిన్
సన్నుతిసేయ శక్తులమె? ♦ సజ్జనజీవన! లోకపావనా! 76

ఉ. వేసవిలోన గొఱ్ఱెలకు ♦ వేసటఁబాపఁగ డీయు నున్నియే
వాసిగ శీతకాలమునఁ ♦ బాపును మాచలి నిట్టు లిర్వురున్
గాసికిఁ దప్పుమార్గమును ♦ గల్గఁగఁజేసితి వార! నీకృపా
శాసన మెన్న మాతరమె? ♦ సజ్జనజీవన! లోకపావనా! 77

చ. రవికిఁ బ్రదక్షిణంబుగను ♦ రమ్యముగా భువినీవు ద్రిప్పుటన్
బ్రవిమల సౌఖ్యసంపదలు ♦ భవ్యతరంబుగ మాకుఁగూర్పఁగా
వివిధఋతుల్ క్రమానుగతి ♦ వింతగఁగల్గుచునుండు నీకృపన్
స్తవమొనరింపఁగా వశమె? ♦ సజ్జనజీవన! లోకపావనా! 78

చ. చిగురులచీరెఁగట్టి మఱి ♦ చెన్నలరారెడునట్టి పువ్వులన్
నగలుగఁదాల్చి భృంగముల ♦ నాదముతోఁ బికకూజితంబులన్
సొగసుగఁగూర్చి స్వామినిను ♦ సొంపుగఁబాడి వసంతలక్ష్మి దా
స్వగతసుఖంబుఁ జాటుఁగద! ♦ సజ్జనజీవన! లోకపావనా! 79

చ. చనిచని యంతుగానని ర ♦ సాతల మంటిన నీటి నూటిగాఁ
దనకిరణాళి గ్రీష్మరవి ♦ తద్దయుఁ బీల్చుటచేతనే కదా
ఘనముగ నెల్లనాళములఁ ♦ గాంచిజలంబుతరుల్ చిగుర్చుటల్
జను లరుదంది నిన్బొగడ ♦ సజ్జనజీవన! లోకపావనా. 80

చ. మెఱుపు మనునిప్పుసోఁకఁగనె ♦ మేఘశతఘ్ని భయంకరంబుగా
నుఱుమునుగాని జల్లుమని ♦ యుత్తమశీతలసౌఖ్యవృష్టిఁగో
గురియునుగాదె నీకరుణఁ గూరిమి నెవ్వరు నీసముల్ దయా
శరధివి నీవెగా సకల ♦ సజ్జనజీవన! లోకపావనా! 81

ఉ. పున్నమనాఁటిచంద్రుఁ డను♦పూర్ణసుధాకలశంబు చేతిలోఁ
గ్రన్ననఁ దా శరత్కమల♦గైకొని నీకభిషేక మింపుగా
మ్మనతోఁడ జేసెడిని ♦ మాటికి భక్తులు సంతసిల్లఁగా,
సన్నుతసద్యశోవిభవ! ♦ సజ్జనజీవన! లోకపావనా! 8౨

ఉ. సుందరశిల్పకల్పము వ ♦ సుంధర గావున దీనియందముఁ
గుందఁగనీయరా దనుచుఁ ♦ గూరిమి నీవొడగూర్చికప్పవే
లొందిన జిల్గుగొసెనఁగ♦నొప్ప హిమంబు హిమర్తువందునీ
చందము లెన్నఁ జిత్రములు; ♦ సజ్జనజీవన! లోకపావనా!

ఉ. లేమిని మమ్ము వీడకుము ♦ లేదనఁబోకుము మాకు దిక్కునీ
వే మహనీయయంచు నిను♦నెంతయు వేఁడెదునగ్నశాఖలఁ
ధామనియందుఁ బూర్ణకృప♦నాకులఁబూల నలంకరింతువొ;
స్వామివిగావె యన్నిఁటికి? ♦ సజ్జనజీవన! లోకపావనా! 8౪

ఉ. నిర్వచనీయశక్తియుత! ♦ నేర్పున గొంగళిపుర్వు నందమై
పర్వెడుఱెక్కలం గలిగి ♦ భాసిలు సుందరకీటకంబుగా
నుర్విని మార్చు నీప్రతిభ♦యొక్కటిచాలదె నిన్నుఁజాటఁగా
సర్వశుభప్రదా! సకల ♦ సజ్జనజీవన! లోకపావనా! 8౫

ఉ. పీలిచ్చి పిప్పిచేసినను ♦ బెల్లుగ ముక్కలుగాఁగఁ గోసినన్
గూలిచి శీర్షమున్నఱికి ♦ క్రూరత గానుగఁ బెట్టిత్రిప్పినన్
జీలిచివేసినన్ మధుర ♦ శీలమె చూపుచు భక్తిఁ జాటఁగాఁ
జాలదెపో భువిం జెఱకు ♦ సజ్జనజీవన! లోకపావనా! 8౬

ఉ. చిన్ననినూవుగిం జయునఁ♦జేయఁగఁజాలము సర్వలోకముల్
చెన్నుగఁజేయుచుండునినుఁ♦జింతనసేయుము కండ్రొవ్వసన్
మిన్నును మన్నుఁగానము తు♦మించెదొమమ్మదలించిదిద్దెదో
సన్నుతసత్కృపాభవన ♦ సజ్జనజీవన! లోకపావనా! 87

ఉ. అర్థములేనివస్తు వొక ♦ టైనను గల్గునె నీదుసృష్టిలో!
వ్యర్థులుగామె మేము పర♦మార్థమున న్బనిసేయకుండినన్?
స్వార్థములేని కేవలప ♦ రార్థపరుండవు నీవు గావునన్
సార్థులఁజేయు మయ్య మము ♦ సజ్జనజీవన! లోకపావనా!

ఉ. పచ్చిక మెత్తపానుపుగఁ ♦ బండ్లను దియ్యనివిందుగా సదా
యచ్ఛపునీరె పానముగ, ♦ హాయిగ సోఁకెడు చల్లగాలియే
విచ్చలు వీచు వీవనఁగ, నెమ్మది నెంచుచు నిన్నుఁ గొల్చునా
సచ్చరితుండె ధన్యుఁడుగ ♦ సజ్జనజీవన! లోకపావనా! 89

చ. కలకలలాడుచంద్రుఁగని, ♦ కాకలఁజిమ్మెడుసూర్యుఁగాంచి, వే
జలజలఁ బారునేఱులను ♦ జల్లఁగ వీచెడు గాలిఁ జూచి, భూ
వలయమునందుఁ బండు పలు♦పంటలఁగన్గొని నీకుదండమున్
సలుపనివాఁడు మానవుఁడె? ♦ సజ్జనజీవన! లోకపావనా! 90

ఉ. కోరినవెల్ల నీయవని♦కొందఱు దూషణసేయుచుంద్రునిన్
గోరినవెల్ల నీవిడినఁ ♦ గూళలమై భువినెల్లఁ గూల్పమే?
కూరిమి నిడ్డవెన్నిఁటినో ♦ కుత్సితమార్గములందుఁ గాల్పమే?
సారథివై మము న్నడపు ♦ సజ్జనజీవన! లోకపావనా! 91

చ. వరద! యసంఖ్యహస్తముల♦వారక యిత్తువు నీవు, గోరికల్
కరముల రెంటనే నెటులు♦గైకొనఁజాలుదునయ్య నీకృపన్
గరములుమోడ్చి నీకిడెద♦గౌరవసూచకమౌ నమస్కృతిన్
సరవిఁ బరిగ్రహింపు మిదె ♦ సజ్జనజీవన! లోకపావనా! 92

చ. గిరగిర స్వర్గలోకములఁ ♦ గేలిగఁ ద్రిప్పెడు నీదుశక్తికిన్
బొరిఁబొరి దుష్టులం బొదివి ♦ బుద్ధిని నేర్పెడు నీదుయుక్తికిన్
మరిమరి భక్తులన్మనుచు ♦ మానితమైన త్వదీయరక్తికిన్
శరణముజొచ్చి మ్రొక్కితిని ♦ సజ్జనజీవన! లోకపావనా! 93

చ. హృదయసభాస్థలిన్ బరమ♦హృద్యముగాఁదనరారుభక్తియన్
సదమలభద్రపీఠమున ♦ స్వామిని నిన్ను వసింపఁజేసి స
మ్ముదమునఁగొల్చిధన్యుఁడయి♦ముక్తిని నేనుజెలంగుటెన్నఁడో
సదయ! నిరంతరాభ్యుదయ!♦సజ్జనజీవన! లోకపావనా! 94

ఉ. మాఱునుజంద్రుఁడున్ రవియు ♦ మాఱుగ్రహంబులుపగ్రహంబులున్
మాఱును జంతుసంతతులు♦మాఱునుమానవజాతిరీతులున్
మారును సర్వ; మెన్నఁటికి♦మాఱనివాఁడవు నీవుమాత్రమే
సారెకు వెల్గుచుండుదువు ♦ సజ్జనజీవన! లోకపావనా! 95

ఉ. ఆకసమందు మేఘము మ ♦ హాద్భుతరీతిని మాఱునట్లు లో
కైకశరణ్య! నాహృదయ♦మక్కటమాటికిమాఱుచుండెడిన్
నీకరుణాకటాక్షమున♦నిర్మలము స్థిరమౌను గాక యీ
శా! కరుణాసుధాకలశ!♦సజ్జనజీవన! లోకపావనా! 96

ఉ. ఎచ్చటనుండినన్ మఱియు ♦ నేగతి నుండిన నేమిచేసినన్
బొచ్చెములేని భక్తినినుఁ బుణ్య ♦ చరిత్రుని గొల్వనిచ్చినా
యిచ్చను దీర్పుమయ్య పర♦మేశ్వర! నన్విడనాడకయ్య నీ
సచ్చరితంబె పాడెదను ♦ సజ్జనజీవన! లోకపావనా! 97

ఉ. త్యాగము భోగముంగలిగి ♦ ధర్మపథంబునఁ బీఠికాపురిన్
దాఁ గృపనేలు సూర్యనర ♦ నాథుని నాతనిరాణిధీమణిం
బాగుగ వారిసంతతిని♦బాయనిప్రేమను బ్రోవుమయ్యనిన్
సాగిలిమ్రొక్కి వేఁడెదను♦సజ్జనజీవన! లోకపావనా! 98

ఉ. అందఱు నీకు భక్తులయి ♦ యంచితరీతి దయార్ద్రచిత్తులై
సుందరసద్గుణాభరణ♦శోభితులై ధరణీతలంబు నా
నందమయంబుగా సలిపి ♦ నర్మిలి వర్ధిలుచుండ్రుగాక స
త్సాంద్రయశోవిశాలురయి♦సజ్జనజీవన! లోకపావనా! 99

చ. జయజయ భక్తకోటినుత!♦చారువిశాల యశోవిరాజితా!
జయజయ ఘోరపాపహర!♦సర్వశుభంకర! దుష్టభీకరా!
జయజయభూరిశాంతికర ♦సాధుమనోహర! సత్కృపాకరా!
జయజయపూర్ణ! శ్రీసదన!♦సజ్జనజీవన లోక!పావనా! 100

ఓమ్

# ప్రబోధశతకము.



శ్రీకరుండును దుర్జన ♦ భీకరుండు
శంకరుండును బాపనా ♦ శంకరుండు
రంజనుండును భక్తార్తి ♦ భంజనుండు
విశ్వపతి గాన నతని సే ♦ వింపు మనస. 1

గీ. నిల్వఁగా నేల, బాగుగాఁ ♦ బీల్వ గాలిఁ,
ద్రాగఁగా నీరుఁ, దినఁ బండ్లు, ♦ ధాన్యములను
గొల్లగాఁ బెట్టి జగమను ♦ నిల్లు గట్టె
హరికి మనమీఁద నెంతటి ♦ కరుణ మనస. 2

గీ. వింతవింతగ మెఱపుతో ♦ వీట వీటఁ
గోట్లకొలఁదిగ దీపముల్ ♦ గూర్ప నేమి
దివిని దేవుండు వెల్గించు ♦ దీపమైన
సూర్యునకు సాటివచ్చునే ♦ చూడు మనస. 3

గీ. ఆఁకలికి నేడ్వఁ బాలిచ్చి ♦ యలఁతఁ దీర్చు
నిదుర వచ్చిన జోకొట్టి ♦ నిదురపుచ్చు
మందగింపక వ్యాధికి ♦ మందు వోయు
అమ్మ పరమేశుదయకుఁ జి ♦ హ్నమ్ము మనస. 4

గీ. పెద్దలను భక్తితోడ సే ♦ వింపవలయు
సములతో మైత్రి నెప్పుడు ♦ సలుపవలయుఁ
బతితులను బ్రేమ నుద్ధరిం ♦ పంగవలయు
వసుధ హరికృపఁ గనఁగోరు ♦ వారు మనస. 5

గీ. లోపములనెల్లఁ దేటగాఁ ♦ జూపువాఁడు
మేలు నెప్పుడుఁ గోరుచు ♦ మెలఁగువాఁడు
ఇడుమలను బాపఁ బ్రాణమే ♦ నిచ్చువాఁడు
మిత్రుఁ డనఁదగువాఁడు ధ ♦ రిత్రి మనస. 6

గీ. పాలు పాకింతయుఁ జెడకుండఁ ♦ బూలనుండి
తేనియను బీల్చుచుండెడు ♦ తేఁటికరణి
సౌఖ్య మింతయుఁ జెడకుండ ♦ జనులనుండి
పన్నుఁ గొనుటయె ప్రభునకుఁ ♦ బాడి మనస. 7

గీ. సదమలం బయి సుగుణాళి ♦ సదన మైన
స్వాంతమే కద భువిలోన ♦ స్వర్గ మనఁగ
మలినమయి దుర్గుణాళికి ♦ నిలయ మైన
చిత్తమేకద నరకంబు ♦ చెప్పము మనస. 8

గీ. బలము విద్యయు సుగుణ సం ♦ పదయుఁ గలిగి
ప్రాయమం దుండువారు వి ♦ వాహమైన
నంచితం బగుసంతాన ♦ మబ్బుఁ గాని
బాల్యమునఁ బెండ్లి యాడిన ♦ ఫలమె మనస. 9

గీ. నీతి లేకున్న జగతి వి ♦ ఖ్యాతి లేదు
నీతి లేకున్న మదికి సం ♦ ప్రీతీ లేదు
నీతి లేకున్న నాత్మకు ♦ జ్యోతి లేదు
ఏదియును నీతికిని సాటి ♦ రాదు మనస. 10

గీ. తనకు నభిమానవిషయమౌ ♦ దాని జనుఁడు
దిరముగాఁ గృషి చేసి సా ♦ ధింపవలయు
నన్యవిషయము లెల్ల సా ♦ మాన్యముగను
దెలిసి విద్యావినోది గా ♦ వలయు మనస. 11

గీ. ఒకని మెప్పింప సాధ్యమై ♦ యొప్పుఁ గాని
సర్వజనులను మెప్పింప ♦ సాధ్య మౌనె ?
కానఁ దనయంతరాత్మయై ♦ గ్రాలుచుండు
నొక్క దేవునె మెప్పింప ♦ నొప్పు మనస. 12

గీ. పగను బగ వోదు గావునఁ ♦ బొగరు దక్కి
ధరణి సిరితటఁ బ్రేమామృ ♦ తమ్ముఁ బఱపి
పగను జల్లార్చివైచెడు ♦ పావనుండె
పరమసంతోషధామంబుఁ ♦ బడయు మనస. 13

గీ. ధర్మమును సుంతయైనను ♦ దప్పకుండఁ
దగినమార్పులఁ గాలోచి ♦ తముగఁ జేసి
కాలచక్రంబుతోఁబాటు ♦ కదలుజాతి
పరమసౌభాగ్యవంతమై ♦ ప్రబలు మనస. 14

గీ. స్వర్గమునకంటెఁ దనదగు ♦ జన్మభూమి
నెంతయును గొప్పగా నెంచి ♦ సంతతంబు
దానివృద్ధికి నన్నివి ♦ ధాలచేతఁ
బూని పనిసేయు దేశాభి ♦ మాని మనస. 15

గీ. ప్రబలు రెప్పుడు భువిని దు ♦ ర్బలులఁ దుఱింప
వేచి యుందురు గాన వి ♦ వేకమతులు
దైవమును నమ్మి యెంతయు ♦ ధైర్యమూని
యెల్లబలముల నార్జింప ♦ నెంత్రు మనస. 16

గీ. అవయవము లెల్ల నైకమ ♦ త్యమ్ముతోడ
దేహమును గాచుచుండెడు ♦ తెఱఁగు దోఁప
దేశభక్తులు దమతమ ♦ దేశములను
గాచుకొం ద్రైకమత్యంబు ♦ గలిగి మనస. 17

గీ. తమసుఖమ్మును దుఃఖమ్ము ♦ తనవి గాఁగ
నెంచి తమపయి సుఖమె వ ♦ ర్షించుచుండి
ప్రాణపదముగఁ దమ్ముఁ గా ♦ పాడునేని
ప్రభునికియ్యరె ప్రాణమేఁ ♦ ప్రజలు మనస. 18

గీ. ఎప్పటికి నెవ్వి జనుల క ♦ భీప్సితములో
యప్పటికి వాని నిర్మించి ♦ యద్భుతముగ
నమ్మకము గొల్పి యోగ్యలా ♦ భమ్ముఁ గొనుచు
నమ్మి ధనవంతులౌట న్యా ♦ యమ్ము మనస. 19

గీ. పరులు దనపట్ల నెట్టులు ♦ పరఁగగోరుఁ
బరులపట్టులఁ దానట్లు ♦ పరఁగుచుంట
ధరణిలోఁపల నుత్కృష్ట ♦ ధర్మమంచుఁ
జాటి రార్యులు సర్వదే ♦ శముల మనస. 20

గీ. వివిధవిజ్ఞానశాస్త్రముల్ ♦ విశ్వవిభుని
నిరత మొకతీరుగా వెల్గు ♦ నియమములను
దెల్పి యాతనిమహిమ బో ♦ ధించుఁ గాన
వాని నందఱుఁ బఠియింప ♦ వలయు మనస. 21

గీ. తాను వసియింపఁ బ్రేమతో ♦ దైవ మిడిన
మందిరమ్మగు దేహమ్ము ♦ నందునుండు
యంత్రములగూర్చి యెఱుఁగని ♦ యజ్ఞుఁ డెట్లు
కడు సుకమ్ముగ వసియింపఁ ♦ గలఁడు మనస. 22

గీ. సృష్టిలోపలిచేతనా ♦ చేతనములు
పరుల కుపకార మొనరించి ♦ వఱలుచుండ
మానవుఁడు స్వార్థపరుఁడయి ♦ మనియెనేని
వానిజన్మంబు భువిని ని ♦ ష్ఫలము మనస. 23

గీ. ఆకసంబున నెల్లబ్ర ♦ హ్మాండములను
నలుసులట్లుగఁ దేల్చి య ♦ నంతమహిమఁ
జూపుసర్వేశు మదిలోనఁ ♦ జూడఁజేని
వాఁడెపో యంధుఁ డనఁదగు ♦ వాఁడుమనస. 24

గీ. చూచువా రెంతయును మదిఁ ♦ జోద్యమందఁ
జిత్తరువు వ్రాసి దానికి ♦ జీవ మిడఁగ
శక్తి లేమిని గర్వంబు ♦ సర్వ ముడిగి
దైవమును జిత్రకారుఁడు ♦ దలఁచు మనస. 25

గీ. వేనిచేతను దేశముల్ ♦ వృద్ధిఁ గనెనొ
వేనిచేత నశించెనో ♦ వానినెల్ల
దేశచరితలలోఁ గాంచి ♦ దేశమునకు
వృద్ధి గూర్పఁ గడంగు సు ♦ బుద్ధి మనస. 26

గీ. పెరుఁగును మథింపఁ గలిగెడు ♦ వెన్నమాడ్కిఁ
బ్రకృతిని మథించుకొలఁదిఁ బ్ర ♦ పంచమునకు
మేలు సమకూర్చువస్తువుల్ ♦ వేలకొలఁదిఁ
గలుగుఁ దఱుఁగనిపరమేశు ♦ కరుణ మనస. 27

గీ. పువ్వులోపలఁ దేనె, ను ♦ వ్వులను నూనె,
యబ్ధిలో నుప్పు, దారువు ♦ లందు నిప్పు,
పెరుఁగులో వెన్న పెట్టిన ♦ కరణి నెన్న
నీశ్వరుఁడు దేహమునఁ బ్రాణ ♦ మిడెను మనస. 28

గీ. వినెడువారికి వీనుల ♦ విందుగాఁగఁ
బరమపురుషుని సుగుణప్ర ♦ భావములను
వివిధవృత్తాళిలోపల ♦ వినుతి సేసి
సుకవిసంతోషభరమునఁ ♦ జొక్కు మనస. 29

గీ. రాగతాళమ్ములను గూర్చి ♦ రమ్యఫణితిఁ
బాడనేర్చిన మాత్రాన ♦ ఫలము గలదె?
దేవదేవునిదివ్యప్ర ♦ భావములను
జెన్నుమీఱఁగఁ గీర్తింప ♦ కున్న మనస. 30

గీ. ఒక్కవైపున సూర్యుని ♦ నొక్కవైపు
సురుచిరంబుగఁ జుక్కలఁ ♦ జూపుకొఱకు
రమ్యతరమైనభూమియన్ ♦ రాట్నమందుఁ
బెట్టి మముఁ ద్రిప్పఁగద విశ్వ ♦ విభుఁడు మనస. 31

గీ. పలుతెఱంగులఋతువులు ♦ గలిగి జనులు
వివిధసౌఖ్యమ్ములను గాంచి ♦ వెలయుకొఱకు
సకలజగదేకనాథుశా ♦ సనముచేతఁ
ధరణిచుట్టును దిరుగును ♦ దరణి మనస. 32

గీ. దుష్టులే లేకయుండిన ♦ శిష్టులకును
సుగుణసంపద యెల్లను ♦ జూపుటకును
సమయ మబ్బునె కావున ♦ జగతియందుఁ
గ్రాలు నన్నిటఁ బరమేశు ♦ కరుణ మనస. 33

గీ. పాపికిదు భీతి, బాధకుఁ ♦ బార మొసఁగు
వచ్చువారికిఁ జోటిచ్చుఁ; ♦ బ్రతిభఁ జూపఁ
గ్రొత్తవారికి సమయంబుఁ ♦ గూర్చుఁ గాన
మరణమునఁగూడ హరికృప ♦ మెఱయు మనస. 34

గీ. పాటుపడఁ దిండి రుచ్యమై ♦ పరఁగుచుండుఁ
బాటుపడ హాయిగా నిద్ర ♦ పట్టుచుండుఁ
బాటుపడ దేహ మారోగ్య ♦ భాగ్య మందుఁ
బాటుపడువాఁడె సుఖములఁ ♦ బడయు మనస. 35

గీ. బడలికను దీర్ప, నొడలికి ♦ బలముగూర్పఁ,
పాటవముతోడ బుద్ధికిఁ ♦ దేటగొల్పఁ
జక్కఁగాఁ బనిసేయను ♦ త్సాహ మిడఁగ
నుచితమగునిద్ర పరమేశుఁ ♦ డొసఁగె మనస. 36

గీ. ప్రస్తుతం బున్నతిని గాంచఁ ♦ బాటుపడక
పూర్వులపరాక్రమాదులే ♦ పొగడికొనుచు
వ్యర్థముగఁ గాలమునుబుచ్చు ♦ వాని బుధులు
వట్టిమూర్ఖునిగా నెంత్రు ♦ వసుధ మనస. 37

గీ. స్త్రీలు పురుషులుగూడ నే ♦ దేశమందు
మోద మిడుదురొ విద్యావి ♦ నోదు లగుచు
నద్ది సర్వేశుకరుణచే ♦ నలరుచుండి
దేశములకెల్లఁ దిలకమై ♦ తీరు మనస. 38

గీ. లోపములఁ జూపువారిపైఁ ♦ గోపపడక
వందన మొనర్చి తనకున్న ♦ కుందులెల్లఁ
బాపుకొనఁ బాటుపడుచుండు ♦ భవ్యమతియె
యఖిలసద్గుణవంతుఁడై ♦ యలరు మనస. 39

గీ. ఎట్టివాఁడైనఁ బరమేశు ♦ సృష్టిలోన
గర్వభరమునఁ గన్నులు ♦ గానఁడేని
లోఁతు తెలియంగరానట్టి ♦ గోతిలోనఁ
దల్లక్రిందుగఁ బడును ద ♦ థ్యమ్ము మనస. 40

గీ. తన్నునమ్మినవారల ♦ యున్నతికిని
దఱిని సాయమ్మొనర్పఁగఁ ♦ దప్పువాఁడు
కీడుమూడినయప్పుడు ♦ తోడుగనక
డిల్లపడి యెంతయును దల్ల ♦ డిల్లు మనస. 41

గీ. దిక్కుమాలినదీనులఁ ♦ బెక్కులైన
తంత్రములచేత నొక్కఁగాఁ ♦ దలచువాని
నొక్కసారిగ భగవంతుఁ ♦ డుక్కడంచు
దీనరక్షయె తనదీక్ష ♦ గాన మనస. 42

గీ. తీసి యీలేనిప్రాణముల్ ♦ దీసి తీసి
భావమం దుండుకరుణను ♦ బాపి పాపి
చేత వాతను బాపముల్ ♦ చేసి చేసి
బ్రదుకుమనుజుఁడు భూమికి ♦ బరువు మనస. 43

గీ. ఒరులయున్నతి వీక్షించి యుడుకువాఁడు
తనప్రతాపమ్మె కొనియాడు ♦ కొనెడువాఁడు
బాధపడువారిఁ గని దుఃఖ ♦ పడనివాఁడు
పరమపాతకుఁ డనఁదగు ♦ వాఁడు మనస. 44

గీ. శత్రువేషంబుఁ దాల్చిన ♦ మిత్రుఁ డరయఁ
జేయలేఁడేని మేల్ కీడు ♦ సేయకుండు
మిత్రవేషంబుతో నున్న ♦ శత్రు వన్నఁ
గూర్మిఁ జూపుచునే గొంతుఁ ♦ గోయు మనస. 45

గీ. దుర్జనులు సజ్జనులవలెఁ ♦ దోఁచుచుంద్రు
తోఁచుచుందురు సుజనులు ♦ దుష్టులట్టు
లున్నరీతిని గనపడ ♦ కుంద్రుజనులు
గానఁ బై వేషముల నమ్మఁ ♦ గాదు మనస. 46

గీ. పరులదోషముఁ గనఁ బాటు ♦ పడుటకంటెఁ
దొడరి తనదోషమును జూడఁ దొడఁగెనేని
మాని తనయల్పభావంబు ♦ మానవుండు
పడయుచుండు నుదారభా ♦ వంబు మనస. 47

గీ. జగములోపల నిష్ప్రయో ♦ జనముగాఁగ
నేదియును హరి సృష్టింప ♦ లేదు గానఁ
బనికిమాలిన దని దేనిఁ ♦ బలుకకుండ
దానియుపయోగ మెఱుఁగంగఁ ♦ దగును మనస. 48

గీ. వానకోయిల తమితోడ ♦ వానచినుకు
కొఱకు వేచెడుగతిని స ♦ ద్గుణముకొఱకు
వేచి యెచ్చట నది గన్న ♦ విడువకుండ
నీదిగా నెంచి కైకొంట ♦ నీతి మనస. 4౯

గీ. అప్పటికిఁ గష్ట మొదవిన ♦ నెప్పటికిని
సుఖమె కలిగెడు పని సేయఁ ♦ జూడవలయు
నప్పటికి మేలు గల్గిన ♦ నెప్పటికిని
గష్టమబ్బెడు పని సేయఁ ♦ గాదు మనస. 50

గీ. హానిలాభమ్ములనుబట్టి ♦ యరసి చూడఁ
గొందఱకు నష్ట మొదవినఁ ♦ గొంచెముగను
బలువురకుఁ జాల మేలును ♦ గలుగఁజేయు
పనులు సేయుచు నుంటయే ♦ పాడి మనస. 51

గీ. పాపపుణ్యంబులనుగూర్చి ♦ భవ్యమతులు
స్పష్టముగఁ దెల్పినట్టిల ♦ క్షణము వినుము
పరుల కపకార మొనరింపఁ ♦ బాప మగును
బరుల కుపకృతి పుణ్యమై ♦ పరఁగు మనస. 52

గీ. మంచిచెడుగులు రెండును ♦ మనుజునందుఁ
బెనగొనియె యుండు, మంచిని ♦ బెంపకున్నఁ
జెడుగు చెలరేఁగుఁ, జెడుగును ♦ జెడ నడంప
మంచి తలయెత్తి యెంతయు ♦ మించు మనస. 5౩

గీ. సుగుణమణిహార సూత్రమై ♦ నెగడుచుండు
మార్తురనుగూడ సఖులుగా ♦ మార్చుచుండు
గుప్తముగఁ గీర్తి నల్గడఁ ♦ గూర్చుచుండు
నడఁకువయె యెల్లవారికిఁ ♦ దొడవుమనస. 54

గీ. పరుల కుపకార మొనరింపఁ ♦ బాటుపడెడు
పుణ్యమూర్తికి హృదయానఁ ♦ బొదలుశాంతి
ఘోరతరములు గష్టముల్ ♦ గోట్లకొలఁది
వచ్చినను నోర్చుకొనుశక్తి ♦ నిచ్చుమనస. 55

గీ. తమసుఖమె చూచుకొనుచుండు ♦ దంపతులకు
నీశ్వరుఁడు ప్రేమసంతాన ♦ మిడుట చూడఁ
బరులకై స్వార్థమును వీడి ♦ పాటుపడఁగ
నెమ్మినొసఁగెడుప్రథమపా ♦ ఠమ్ము మనస. 56

గీ. తనబలమ్మును విద్యయుఁ ♦ దనధనమ్ము
దేవదత్తము లని మదిఁ ♦ దెలిసి వాని
సతతము పరోపకృతి నిడు ♦ సదయుమీఁద
హరి సుఖామృతవృష్టిని ♦ గురియుమనస. 57

గీ. విత్తనము నష్టమైనను ♦ వృక్షరూప
మొంది వర్ధిల్లుచుండెడు ♦ చందమునను
గాయ మెడలినసుజనుండు ♦ ఖ్యాతిరూప
కాయమును బొంది వర్ధిల్లుఁ ♦ గాదె మనస. 58

గీ. వివిధభాషలయం దుండు ♦ విషయములను
లలితమౌ శైలితోడ స ♦ లక్షణముగ
మాతృభాషను భాషాభి ♦ మానివ్రాసి
యక్షయంబగుకీర్తిచే ♦ నలరు మనస. 59

గీ. సూదిబెజ్జంబులోపల ♦ సూటిగాను
సామజంబైన దూరంగఁ ♦ జాలుఁగాని
మోక్షరాజ్యమహాద్వార ♦ మును జొరంగ
లేఁడు విషయాబ్ధి మునిఁగిన ♦ వాఁడు మనస 60

గీ. యుద్ధమున వేలకొలఁదిగ ♦ యోధవరులఁ
గూల్చువీరునికంటెను ♦ ఘోరపాప
జాలములతోడఁ బోరాడి ♦ జయముగాంచు
వీరుఁడే యుర్వి శ్రేష్ఠుఁడై ♦ వెలయు మనస. 61

గీ. అఖిలపాపములకు మూల ♦ మగుచు నడరు
నింద్రియాళిని నెదిరి జ ♦ యించి వాని
సత్పథంబున నడిపింపఁ ♦ జాలఁడేని
నెన్ని రాజ్యము లేలిన ♦ నేమి మనస. 62

గీ. ఎంతధనమున్న బిరుదుల ♦ నెన్నిగన్న
సకలవిద్యలయందును ః జాణయైన
నెవఁడు దనజన్మ భూమిప్రే ♦ మింపకుండు
వాఁడె జీవన్మృతుండనఁ ♦ బడునుమనస. 63

గీ. వివిధదేశస్థులందఱు ♦ విహితమతిని
మించునన్యోన్యప్రేమ వ ♦ ర్తించి రేని
జగడములుమాని శాంతితో ♦ నెగడిరేని
భూతలంబెల్ల స్వర్గమై ♦ పొదలు మనస. 64

గీ. పాపమునుగూడ మర్యాదఁ ♦ బడయుటకును
బుణ్యవేషంబుఁ దాల్చెడు ♦ పోల్కి చూడఁ
బూని పాపంబుగూడ న ♦ ప్పుణ్యమునకు
గౌరవముఁ జూపుచుండుట ♦ గాదె మనస. 65

గీ. సత్యమనుధ్రువరేఖపై ♦ సంతతంబు
దిరుగుచును నిల్చి హరియందుఁ ♦ దిరముగాను
సత్పథమ్మున నరుగుప్ర ♦ శస్తమతియె
భూతలస్వర్గలోకమై ♦ పొల్చు మనస. 66

గీ. పొగడుఁగాక జనావళి ♦ దెగడుఁగాక
పెంత్రుగాక నృపాలురు ♦ నొంత్రుగాక
చేరుఁగాక సుఖమ్ములు ♦ జాఱుఁగాక
సత్పథమునుండి తొలఁగంగఁ ♦ జనదు మనస. 67

గీ. సత్యమైయొప్పున్యాయ ప ♦ క్షంబుఁ బూని
సములపైఁగాని తమకంటె ♦ శక్తియందు
నధికులౌవారిపైఁగాని ♦ యడరి తొడరి
గెలుపుకొనుటయె శౌర్యమై ♦ వెలయు మనస. 68

గీ. దీనులై తమకెవ్వరు ♦ దిక్కులేక
పొక్కువారలపైఁ బొగ ♦ రెక్కియరిగి
పెక్కుబాధలఁ జిక్కించు ♦ ఫక్కిచూడఁ
గ్రౌర్యమే కాని శౌర్యంబు ♦ గాదు మనస. 69

గీ. మహిని దప్పొనరించుట ♦ మనుజగుణము
తప్పు క్షమియించు టెంతయు ♦ దైవగుణము
గానఁ జేసినతప్పుకై ♦ కరము వగచు
దీను క్షమియింప హరి మెచ్చి ♦ తీరు మనస. 70

గీ. చూపవలయును మిత్రుని ♦ లోపములను
జూడవలయును శత్రుని ♦ సుగుణములను
జూచికొని తనలోపలఁ ♦ జొచ్చియున్న
పాపములనెల్లఁ బాపుకో ♦ వలయు మనస. 71

గీ. తమచరిత్రల నుత్తమో ♦ త్తమములుగను
జేసికొనఁగోరువారల ♦ చిత్తములకు
నెదుట నాదర్శకము లయి ♦ బొదలుచుండు
ధరమహాత్ములసచ్చరి ♦ త్రములు మనస. 72

గీ. బలము నార్జింప సుగుణసం ♦ పద గడింప
భక్తి మదిఁ బెంపఁ బరమపా ♦ వను భజింప
గురుల సేవింప విద్యల ♦ నెఱిఁ బఠింప
బ్రహ్మచర్యంబు వహియింప ♦ వలయు మనస. 73

గీ. అంద ఱానందమునఁ దేలి ♦ యాడుచుండ
నేడ్చుచును వత్తు మిబ్బువి ♦ కెల్లరమును
వగవ మనకంద ఱానంద ♦ ముగను మనము
పోవునట్లుగ మెలగంగఁ ♦ బోలు మనస. 74

గీ. వచ్చి గర్వంబు దనలోనఁ ♦ జొచ్చెనేని
హరికిఁ దనకును నుండెడు ♦ నంతరంబు
మనుజుఁడు దలంప నెండకు ♦ మంచువోలెఁ
గరఁగిపోవును గర్వ మా ♦ క్షణమె మనస. 75

గీ. పాపరోగంబు నిన్నుండి ♦ పాయుటకును
వేకువను సంజ నిత్యంబు ♦ విడువకుండ
హరిగుణధ్యాన మనుపర ♦ మౌషధంబు
భక్తియుతముగ సేవింప ♦ వలయు మనస. 76

గీ. హృదయసింహాసనంబున ♦ నీశు నునిచి
సకలజీవులకును దన ♦ శక్తికొలఁదిఁ
గూర్మితో సాయమొనరించు ♦ కొలు వొనర్చి
మనెడుకరుణాళువే భక్తుఁ ♦ డనఁగ మనస. 77

గీ. భక్తు లని వేషములు వేయ ♦ వచ్చుఁగాని
నిర్మలం బగుమదితోడ ♦ ధర్మ మెఱీఁగి
పరమపురుషునియాజ్ఞలో ♦ పల మెలంగి
ధన్యతము లౌట మిగులదు ♦ స్థిరము మనస. 78

గీ. చాటుచాటుగఁబాపముల్ ♦ చాల సలిపి
యంద ఱెఱుఁగ నొకింతపు ♦ ణ్యంబు చేసి
జనుల వంచింప నగుఁ గాని ♦ సర్వ మెఱుఁగు
దైవమును మోసపుచ్చంగఁ ♦ దరమె? మనస. 79

గీ. పాపములకయి లోనఁ జీ ♦ వాట్లు పెట్టి
యంద ఱెఱిఁగెడునట్లు పు ♦ ణ్యంబులకును
దగినయాదరమును గూర్చి ♦ దయను జూపు
జగదధీశున కెవ్వరు ♦ సాటి? మనస. 80

గీ. మిత్రుఁడుగఁ గొందఱకు నుండు ♦ శత్రువుగను
గొందఱకు నుండుఁ దక్కిన ♦ యందఱకును
మహిఁ దటస్థుఁడుగా నుండు ♦ మానవుండు
అందఱకు మిత్రుఁడగువాఁడు ♦ హరియె మనస. 81

గీ. నిప్పు గాల్పంగ లేనట్టి ♦ నీరమైన
గడిగివేయంగ లేనట్టి ♦ గాలియైనఁ
బారఁదోలంగ లేనట్టి ♦ పాపములను
నిముసమునఁ బాపు హరిఁ జేరి ♦ నెగడు మనస. 82

గీ. అంతరాంతరహృదయగు ♦ హాంతరమునఁ
గదలి మెదలక తిరముగాఁ ♦ బొదలుమాని
తేట తెల్లంబుగాఁ జూపు ♦ తెన్నువట్టి
మోక్షసామ్రాజ్యమును జేరఁ ♦ బొమ్ము మనస. 83

గీ. విన్నఁ బరమేశుమాటలే ♦ వింటివేని
గన్నఁ బరమేశుతత్త్వమే ♦ కంటివేని
మన్నఁ బరమేశుసేవనే ♦ మంటివేని
సున్నమై పోవు పాపమ్ము ♦ లన్ని మనస. 84

గీ. పాడుచుండుము హరికీర్తి ♦ భక్తితోడఁ
గూడుచుండుము భక్తులఁ ♦ గూర్మితోడ
వీడుచుండుము దుష్టుల ♦ వెరవుతోడ
హరి ముదంబున నీతోడ ♦ నాడ మనస. 85

గీ. గుట్టు సఖులకుఁ దెల్పినఁ ♦ గూర్మి మఱచి
వెల్లడింతురు లోలోన ♦ నెల్లరకును
ఎన్ని దెల్పిన విని హరి ♦ యించుకైన
నెవరికిని జెప్పఁ డెంతటి ♦ హితుఁడు మనస. 86

గీ. ఇచ్చటికి నిన్ను దేవుఁడు ♦ దెచ్చినప్పు
డెన్నిసదుపాయములఁ గూర్చె ♦ నెఱుఁగుదు గద
యెచటకిం గొనిపోయిన ♦ నచటఁగూడ
నిట్లె కృపచేయు నని నమ్మ ♦ వేల? మనస. 87

గీ. గర్భమందున్నయప్పుడు ♦ గాచినాఁడు
గాఢమానిద్రయందును ♦ గాచినాఁడు
గావకుండునె? మరణంబు ♦ గాంచినపుడు
చేర్చి తనయొడి హరి నిన్నుఁ ♦ దేర్చు మనస. 88

గీ. జననికడనుండి వచ్చి యా ♦ జననిదరికి
నరుగఁ జింతిల్లునినుఁ జూడ ♦ నలుక వొడముఁ
బుట్టినింటికి నందఱు ♦ ముదముతోడఁ
బోవ నీకిది యేమిదు ♦ ర్బుద్ధి మనస. 89

గీ. పట్టియున్నట్టిమైలను ♦ బాపుటకును
బట్టలను బండపైఁ బెట్టి ♦ బాదునట్లు
వీడిపోవంగఁ బాపముల్ ♦ వెతను బెట్టి
దేవుఁ డుతుకును నిన్ను భీ ♦ తిలకు మనస. 90

గీ. ఎప్పు డెచ్చటఁ గోరిన ♦ నప్పు డచట
దర్శనం బిచ్చి నినుఁగాచు ♦ దాత యైన
దైవ ముండంగ నల్పుల ♦ దరిని జేరి
వృథగ యాచించుచుండుదు ♦ వేల? మనస. 91

గీ. కూర్మి నీమీఁద శుభములే ♦ కురియుచుండు
దేవుఁ డొసఁగినదానితోఁ ♦ దృప్తిఁ గనక
యేల యడిగెద విది యది ♦ యిమ్మటంచు
నెఱుఁగఁడే హరి నీకెద్ది ♦ హితమొ? మనస. 92

గీ. ఒండొకటితోడ ఢీకొన ♦ కుండుమాడ్కి
నద్భుతమ్ముగ దివిని బ్ర ♦ హ్మాండములను
వివిధరీతులఁ ద్రిప్పెడు ♦ విశ్వవిభుని
చేతిలీలారవిందమై ♦ చెలఁగు మనస. 93

గీ. రమ్యకల్యాణగుణమణి ♦ రచితభక్త
హృదయసింహాసనంబునఁ ♦ బొదలుచుండి
సకలజగముల నేలెడు ♦ సార్వభౌము
కూర్మిబిడ్డవు నీకేమి ♦ కొదువ? మనస. 94

గీ. అర్కశతకోటిచంద్రస ♦ హస్రకోటి
కలితలలితమహాద్భుత ♦ కాంతియుక్త
చారుసౌందర్యమూర్తియౌ ♦ స్వామియెదుట
నిల్వుటద్దముగా నిల్చి ♦ నెగడు మనస. 95

గీ. ధర్మవైరులఁ జెండాడ ♦ దైవ మెంచి
వారిపై నినుఁ గొల్పిన ♦ వార్యధైర్య
శౌర్యములఁ జూపి పోరాడి ♦ జయముగాంచి
దివ్యభృత్యుండ వనుకీర్తిఁ ♦ దెమ్ముమనస. 96

గి. నమ్మి నీకంతయు నొసంగు ♦ నమ్మకమ్ము
స్వామికిని గల్గునట్లుగా ♦ సంచరించి
పరమమైత్రిని నాతని ♦ పజ్జఁజేరి
యార్తులకు నెల్ల నాప్తుండ ♦ వగుము మనస. 97

గీ. నేను వరియింప నెవరిని ♦ నిన్నెకాని
యంచు నన్నియు విడనాడి ♦ హరిని నీవు
వలచితివి గాన నతఁడును ♦ వలచె నిన్నుఁ
గూర్మినొకటైతి రింకేమి ♦ కొఱఁత? మనస. 98

గీ. ఏకతంబున లోనఁ బ్రా ♦ ణేశుఁడైన
పరమపురుషునితోఁ గూడి ♦ పాడియాడి
నిరుపమానందభరమునఁ ♦ గరముచొక్కి
మఱచిపొమ్మెల్ల నిను నీవు ♦ మఱచి మనస. 99

గీ. ఎంతకూరిమి నొక్కఁడై ♦ యెసఁగుచున్న
ప్రభువు వరియించె నని గర్వ ♦ పడితివేని
పడినపాటెల్ల వ్యర్థమై ♦ ప్రథమదశకు
నిన్ను నగ్గర్వమే దెచ్చు ♦ నిజము మనస. 100

గీ. స్వచ్ఛమైనట్టిభక్తితో ♦ స్వామిసేవ
నఖిలవిధములచేత నీ ♦ వాచరించి
మరలి రాకుండ మోక్షసా ♦ మ్రాజ్య మందె
యలరుచుండుము నాప్రియ ♦ మైనమనస. 101

గీ. అంద ఱా ప్రభుసంతాన ♦ మగుటఁ దెలిసి
గాఢసోదరభావంబు ♦ గలిగి మెలఁగి
భూతలం బెల్ల స్వర్గమై ♦ పొదలునట్లు
సలుపవేడుము సర్వేశు ♦ సతము మనస. 102

గీ. శతక మిది వ్రాయఁగోల్పిన ♦ హితుని సుగుణ
రతుని నాయని వేంకట ♦ రంగనృపుని
దత్సతిని సంతతిని మహో ♦ దారమతిని
బెంపఁ బరమేశు భక్తిఁ బ్రా ♦ ర్థింపు మనస. 103

శ్రీ

# భక్తకర్ణామృతము.



మధ్యమావతి-చాపు

ఎంతవాఁడను నిన్నుఁ గీర్తింప

ఈశ్వర నే

నెంతవాఁడను నిన్నుఁ గీర్తింప

నుంతయైననుగానసాహితి ♦ చొప్పెఱుంగని శుద్ధమూర్ఖుఁడ॥ నెం॥
వింతవింతగనిన్నుఁగూరిచి ♦ వేయివిధములఁబాడుటకునా
కెంతయోమది యున్నదదిఫల ♦ వంతమగు టెట్లో యెఱుంగను
॥ఎం॥

చారుసంగీత ప్రవీణులు నారదాదిమహామునీంద్రులు
సారెకును బాడంగఁగూరిమి ♦ మీఱ నాకర్ణించు విభుఁడవు॥ఎం॥
రాగతాళము లెల్ల నేరిచి ♦ రక్తితోనినుఁబాడి నీయను
రాగమునునార్జించిమించిన ♦ త్యాగరాజునుగాను బీదను॥ ఎం॥
భక్తితో నీశుభగుణమ్ముల ♦ భవ్యరీతులఁ బాడుటకుఁగల
శక్తులెవ్వియు లేనివాఁడను ♦ స్వామినిన్నే నమ్మినాఁడను ॥ఎం॥
హెచ్చుగానినుఁగొల్చిపాడెదు ♦ నెందఱో మహనీయులుండఁగ
మెచ్చుకొందువె యీశ్వరానా ♦ వచ్చిరానీ గీతజాతము॥ఎం॥

2 కమాచ్-ఛాపు

కొనియాడఁదరమే నిన్నుఁ

గువలయవినుత

కొనియాడఁదరమే నిన్నుఁ

దినకరశశితార ♦ గణములవెలిఁగించి
ఘనతేజమునుజూపు ♦ కాంతిమంతుఁడవీవు ॥కొని॥

బొంగరమ్ములమాడ్కి ♦ భూమ్యాదిగ్రహముల
నింగి గిరగిరఁద్రిప్పు ♦ నేర్పుకాఁడవునీవు ॥కొని॥

ఒండొంటి డీకొన ♦ కుండలోకములను
ద్దండరీతిని నడుపు ♦ చండశాసనుఁడీవు ॥కొని॥

స్తుత్యమానీసృష్టి ♦ సుందరమ్ముగఁజేసి
యత్యద్భుతముఁజూపు ♦ నైంద్రజాలుఁడవీవు ॥కొని॥

పాఠశాలగ జగతి ♦ బహువిధములఁజేసి
పాఠములనునేర్పు ♦ పరమగురుఁడవు నీవు ॥కొని॥

55 సురట—ఆదితాళము.

పొగడఁదరమె నిన్ను మాప్రభు పొగడఁదరమె నిన్ను

ధగధగ మెఱసెడు ♦ తరణికోటులకు
జిగిబిగిఁగూరుచు ♦ చిన్మయరూపా! ॥పొగ॥

అగణితమగుబ్ర ♦ హ్మాండకోటులను
సొగసుగఁదీరిచి ♦ సూత్రధారివయి
గగనరంగమునఁ ♦ గడుఁజోద్యమ్ముగఁ
దగనాడించెడు ♦ తాండవ లోలా! ॥పొగ॥

నేత్రపర్వముగ ♦ నిగనిగలాడెడు
చిత్రవిచిత్రపుఁ ♦ జిన్నెలవన్నెల
ధాత్రిని నతిసొం ♦ దర్యారాశియా
చిత్రశాలగాఁ ♦ జేసినస్వామీ! ॥పొగ॥

వీనుల విందుగ ♦ వివిధస్వరముల
గానముచేసెడు ♦ కలకంఠాదుల
మానితరీతిని ♦ మహిఁ నలరించెడు
గానకళాలం ♦ కరణధురీణా! ॥పొగ॥

పరిపరివిధముల ♦ పాపరోగములఁ
బరితపించుమా ♦ పరితాపమ్ములఁ
బరమకృపామృత ♦ ఫలితౌషధములఁ
బరిహారముసేయు ♦ వరవైద్యమణీ! ॥పొగ॥

4 బేహాగ్-ఆదితాళము.

నినుఁ గొనియాడఁగ ♦ నేర్చు నెవ్వఁడు భువి
మనమునకందని ♦ మహిమలునీవి ॥నిను॥

మునులు ఋషీంద్రులు ♦ ముదమునహృదయాన
ననుదినమును నిన్నె ♦ యరయుచునుండియు
దినకరకోటుల ♦ దివి వెలిఁగించియుఁ
గనఁబడకున్నావు ♦ కరమువిచిత్రము ॥నిను॥

వివిధజగమ్ముల ♦ వింతగఁద్రిప్పుచు
నవనవలీలల ♦ నటనము సల్పుచు
నెవరు నెఱుంగని ♦ యేకాంతమ్మునఁ
బ్రవిమలకాంతితో ♦ భాసిలుచుందువు ॥నిను॥

నమ్మినభక్తుల ♦ నెమ్మదిలోపలఁ
దుమ్మెదవలెవాలి ♦ ఝమ్మనిపాడుచుఁ
గమ్మనిభక్తిర ♦ సమ్మునుగ్రోలుచుఁ
గొమ్మని శుభములఁ ♦ గురియుచునుందువు ॥నిను॥

5 శంకరాభరణము రూపకము.

దేవనీప్రభావగరిమ ♦ తెలియశక్యమా
కేవలకరుణా ప్రపూరమ ♦ కీర్తిధామమా ॥దేవ॥

పరమభక్తినిన్నుఁగొల్చు ♦ భక్తవరులకు
దురితములను దఱుముశక్తి ♦ నిరతమిత్తువు ॥దేవ॥

పరులహితముకొఱకె పాటు ♦ పడెడువారికి
నిరుపమానంద పదవి ♦ నెమ్మిగూర్తువు ॥దేవ॥
నిన్నుఁజూడ నిచ్ఛయించు ♦ సతిపరులకు
నన్నిచోట్లదర్శనమిడి ♦ యాదరింతువు ॥దేవ॥
వివిధజగ్గములను జెలంగు ♦ వింతఁ జూపఁగ
వివిధదేహముల నొసంగు ♦ విశ్వవిభుఁడవు ॥దేవ॥
మొదటఁగష్టపెట్టిమదిని ♦ బదనుపఱచుచు
సదయహృదయుఁడౌటతుదకు♦ముదమునింతువు॥దేవ॥

---

6 మాయామాళవగౌళ–ఆదితాళము.

ఏమనిపిలుతును నిన్ను నే ♦ నేమనిపిలుతునునిన్ను
స్వామీయందున ♦ సఖుఁడాయందున
ప్రేమకునెలవగు ♦ ప్రియుఁడాయందున ॥ఏమని॥
తల్లీయందున ♦ తండ్రీయందున
యెల్లరఁబ్రోచెడు ♦ నీశ్వరయందున ॥ఏమని॥
దివ్యసౌఖ్యమిడు ♦ దేవాయందున
అవ్యయుఁడగు పర ♦ మాత్మాయందున ॥ఏమని॥
భవరోగమహా ♦ వైద్యాయందున
వివిధజగద్గణ ♦ వేద్యాయందున ॥ఏమని॥
గురులకునెల్లను ♦ గురువాయందున
వరములనిడుకల్ప ♦ తరువాయందున ॥ఏమని॥
ఎంతయుభక్తుల ♦ హృదయరంగముల
వింతగవెలిఁగెడు ♦ వెలుఁగాయందున ॥ఏమని॥

7 శ్రీరాగము-చాపు

ఏడనిఁ జూడఁగనగును-నీ జాడ తెల్పుమునాకు ♦ జడమతి నేను
వేడఁగఁజాలను ♦ పాడఁగఁజాలను
కూడి నీతోనుండ ♦ వేడుకగలిగెను ॥ఏడ॥
ఏమనిపిలువఁగవలెనో-ని న్నెచ్చట వెదకఁవలెనో
నామమెఱుంగను ♦ ధామమెఱుంగను
ఏమనిపిలుతు ని ♦ న్నెచ్చట వెదకుదు ॥ఏడ॥
అందఱుని న్నెఱిగినారు-నే డెందఅనడిగిన ♦ నెఱుఁగమన్నారు
పొందుగనినుఁబొంది ♦ పొంగిముదమ్మున
నుందామనునాశ ♦ యుదయించియున్నది ॥ఏడ॥
ఒకపరిదర్శనమిమ్ము-నీ వొకపరిమాటాడిపొమ్ము
ఇఁకనినుఁబిలువను ♦ ఇఁకనేమియడుగను
సకలమర్పించినే ♦ సుకముగసుందును ॥ఏడ॥

8 బేహాగ్-రూపకతాళము.

నినువినా జగదీశమాకు ♦ నెయ్యుఁడెవ్వఁడు
కనికరమున మమ్ముగాఁచు ♦ కాంతుఁడెవ్వఁడు ॥నిను॥
తల్లి గర్భమందునున్న ♦ తరుణమునందుఁ
బిల్లల మముఁగాచినావు ♦ ప్రేమదాతవు ॥నిను॥
తల్లిఁ దండ్రిగురువు నన్నఁ ♦ దమ్ముల సఖుల
నెల్లబంధువులనొసంగి ♦ యెలమిఁగూర్తువు ॥నిను॥
చింతలనొకక్షణములోన ♦ శాంతిపఱతువు
వింతవింతగసృష్టిఁజేసి ♦ వేడ్కనింతువు ॥నిను॥
పాపదావాగ్నిఁజిక్కి ♦ పరితపించెడు
పాపులమము నుద్ధరించు ♦ పావనుండవు ॥నిను॥

### 9 హిందుస్థాని భైరవి-ఆటతాళము.

నిన్నే తలంచెద ♦ నిన్నే వలచెద ♦ నిన్నే కొలిచెదను
నిన్నే ప్రభువర ♦ చిత్తపద్మమున ♦ నిల్పి సుఖించెదను ॥ని॥

ఏకష్టమునా కొదవిన నిన్నే ♦ యెంచి సహించెదను
లోకేశా! నీనామమంత్రమెద ♦ లోన జపించెదను ॥ని॥

నిన్నే ప్రాపుగఁ గొని పాపాబ్ధిని ♦ నిజముగ దాఁటెదను
నిన్నే పతితోద్ధారకుఁడని నే ♦ నిత్యము చాటెదను ॥ని॥

చిత్రవిచిత్రపుసృష్టి నిమాకయి ♦ చేసిన నీకృపను
జిత్రవిచిత్రపురీతుల సతతము ♦ చెలఁగుచుఁ బాడెదను ॥ని॥

---

### 10 బేహాగ్-ఆదితాళము

నీనామమె యెంతో రుచిరా ♦ నిఖిలసజ్జనగోచరా
మానసమున కింపు నింపు ♦ మహితవీణారవము రా ॥నీ॥

మధురమైన నీనామమె ♦ మానులకు జపము రా
అధమాధములనుద్ధరింప ♦ నంచితసాధనము రా ॥నీ॥

అఖిలపాపములను బాప ♦ నదియె సిద్ధౌషధము రా
సుఖమునాత్మబలము నిచ్చు ♦ సురచిరామృతరసము రా ॥నీ॥

భవ్యధర్మరంగస్థిత ♦ భక్తవీరకోటికి
నవ్యయోత్సాహమ్ముఁగొల్పు ♦ దివ్యభేరీరవము రా ॥నీ॥

## 11 శంకరాభరణము - ఆదితాళము.

నీకంటె వేరెవ్వరు మమ్మలరింపఁగ నీకంటె వేఱెవ్వరు
శోకాపనోదివి ♦ లోకవినోదివి
రాకాసుధాంశుకోటి ♦ రమణీయమూర్తివి ॥నీకంటె॥
బ్రహ్మాండకోటులతో ♦ బంతులాడెదునీవు
బ్రహ్మాది బిరుదుల ♦ భాసిల్లుచున్నావు ॥నీకంటె॥
రవిచంద్రతారల ♦ రాజిల్లు దివియెల్ల
ప్రవిమలరత్నాల ♦ పందిరిగదనీకు ॥నీకంటె॥
రక్తిని గొల్చు ప్ర ♦ సక్తితోఁజెన్నారు
భక్తులహృదయమ్మె ♦ భద్రపీఠము నీకు ॥నీకంటె॥

---

## 12 నవరోజు - చాపు.

నిండుచందురుఁడీవుప్రభువర ♦ నిర్వికారశుభంకరా
పండువెన్నెలఁ దిను చకోరపుఁ ♦ బక్షినేను పరాత్పరా ॥నిం॥
కమలపుష్పము నీవుదేవర ♦ కమ్మదేనియఁద్రావునా
భ్రమరమేను త్రిలోకసుందర ♦ భవ్యవిభవధురంధరా ॥నిం॥
నిరుపమప్రజ్ఞానజ్యోతివి ♦ నీవుభక్తవశంకరా
దరిసినీపయి వలచివాలుప ♦ తంగమేనుమనోహరా ॥నిం॥
నీవుపరమానందపూరిత ♦ నీరదముసంపత్కరా
నేవినోదము మీఱనాడెడు ♦ నెమిలిమునివరగోచరా ॥నిం॥

కాంతమినుమును డాసిముద్దిడు ♦ కరణికరుణాసాగరా
చెంతఁజేర్చిముదంబుగూర్చుము♦చిత్తజలరుహ భాస్కరా ॥నిం॥
నీరువీడిన చేపకైవడి ♦ నిన్నువీడి తపించితిన్
నేరమెంచకు నక్షమింపుము ♦ నిఖిలవిమలగుణాకరా ॥నిం॥
చాతకంబను వేచినాఁడను ♦ స్వామినేనొక చినుకుకై
ప్రీతిఁగురియుముపూర్ణవర్షము♦ప్రియతమామృతజలధరా ॥నిం॥

---

13 కల్యాణి - ఆదితాళము.

దినమది సుదినముకాదా
ప్రభు
దినమది సుదినముకాదా
కనుగొని నినుమది ♦ గానము చేసెడు ॥దిన॥
ఘనులగు నీభక్త ♦ జనములఁగూడి
మునినుతనినుఁగూర్చి ♦ ముచ్చటలాడెడు ॥దిన॥
కనికరమెదలోఁ ♦ గరఁగిపాఱఁగా
శనదలకష్టము ♦ లన్నియుఁ దీర్చెడు ॥దిన॥
ధీరతనీయాజ్ఞఁ ♦ దీరిచిపొల్చెడు
వీరుల చరితము ♦ వినిహర్షించెడు ॥దిన॥
కళలఁదేరి స ♦ త్కార్యములొనరిచి
విలసిలు బుధులను ♦ వేడ్కమన్నించెడు ॥దిన॥
నీదయఁ గల్గిన ♦ నిఖిలబంధువుల
నాదరించి ముద ♦ మందుచునుండెడు ॥దిన॥

14 కాంభోజి - చాపు

ఓనాథనీగుణ మొకయింత తెలిసిన ♦ వానిజన్మ మెజన్మము
మానసముప్పొంగి ♦ మేనుపులకరించి
యానందాశ్రుపులొల్క ♦ నారంభమగు దేవా ॥ఓనాథ
జ్ఞానము కరుణయు ♦ న్యాయమువర్ధిల్లఁబూనుధర్మవ్రతము
మానావమానముల్ ♦ మదిని దలంపక
తానునీయాజ్ఞకై ♦ తనవెల్లనర్పించు ॥ఓనా
ఎన్నికీడులుమూఁడి తన్నుబాధించిన ♦ నన్నివిడువఁగల్గిన
నిన్నెదలోనెంచి ♦ నీయాజ్ఞపాలించుఁ
దన్నునిరతముఁగాచు ♦ తండ్రినీవెయంచు ॥ఓనా
సత్యమెనమ్ముచు సత్యమెపల్కుచు ♦ సత్యమెయాచరించు
నత్యంతభక్తితో ♦ నన్నిటనినుఁజూచి
నిత్యానందములోన ♦ నిరతమోలలాడు ॥ఓనా
దీనులయాపదల్ దీర్పంగసమకట్టి ♦ నానాబాధలుపడును
ప్రాణమున్న వఱకుఁ ♦ బరులకుఁదోడయి
తాను జీవనయాత్ర ♦ ధన్యముగానల్పు ॥ఓనా

---

15 కాఫి - చాపు

వారెకృతార్థులు ♦ వసుమతిలోస్వామి
కూరిమితోనిన్నుఁ ♦ గొల్చుచునుండెడు ॥వారె
దూరినదారుణ ♦ దుఃఖములోదవిన
ధీరతనీయాజ్ఞఁ ♦ దీర్చిపొల్చెడు ॥వారె

విబుధులఁజేరి ♦ విద్దెలఁదేరి
శుభగుణవంతులై ♦ శోభిలుచుండెదు ॥వారె॥
ప్రబలబలాఢ్యులై ♦ భక్తినినమ్రములై
యబలులకెల్లను ♦ నభయమొసంగెడు ॥వారె॥
అంతటనీవని ♦ అన్నియునీదని
అంతయు నీకయి ♦ యర్పణచేసెడు ॥వారె॥

---

## 16 మధ్యమావతి - ఆదితాళము.

పతితపావనుఁడవు నీవు ♦ పతితులము మేము
అతులితకృపనుద్ధరింపు ♦ మంచు వేఁడినాము ॥పతి॥
తల్లివీవు పిల్లలు మేము ♦ దయను జేపితనుపుము
ఉల్లమురంజిల్లఁగ నీ ♦ యొడినిడికొని కాపాడుము ॥పతి॥
గురుఁడవీవు శిష్యులు మేము ♦ కోరితిమి సుజ్ఞానము
పరమజ్ఞానదీపము మా ♦ స్వాంతముల వెలిఁగింపుము ॥పతి॥
కేవలము మా స్వామివీవు ♦ సేవకులము మేము
దేవనీకు నిష్టమైన ♦ సేవలోమముఁ బెట్టుము ॥పతి॥
అనుపమసుఖదాతవీవు ♦ యాచకులము మేము
కనికరించి బిచ్చమిడుము ♦ కరము చాఁపినాము ॥పతి॥
ప్రభుడవీవు ప్రజలము మేము ♦ భాగ్యమే సౌభాగ్యము
శుభములనంతములు మాపై ♦ సూటిగా గురియింపుము ॥పతి॥

17 బిల్హరి - రూపకతాళము.

మొగము నేనెట్లు చూపుదు ♦ పూతచారిత్రనీకు
అగణితపాపౌఘములను ♦ ఆచరించి యాచరించి ||మొగ||
సుగుణరాశివైననీదు ♦ సుగుణములను దలఁచియైన
తగనిచెడ్డపనులనుండి ♦ తలగకుండనుండియుండి ||మొగ||
ఎట్టివారికట్టిఫలము ♦ లిత్తువంచుఁ దెలిసి తెలిసి
గుట్టుగుట్టుగాన వెన్నో ♦ కుళపనులఁజేసిచేసి ||మొగ||
పరుల మెప్పుబడయుటకే ♦ పాటుపడుచునుంటిఁగాని
పరమపురుష నీవుమెచ్చు ♦ పనులఁజేయకుంటినే ||మొగ||
దేవనీనివాసమయి ♦ తేజరిల్లు డెందమును
కేవలదుశ్చింతలకును ♦ గృహముచేసి చెఱచిచెఱచి ||మొగ||
పరమస్వర్గధామమయి ♦ భాసిలు సంసారమును
నరకముగాఁజేసికొంటి ♦ నాథనీదునాజ్ఞదాఁటి ||మొగ||

---

18 కమాచ్ - ఛాపు

ఎంతయుఁదగుదునురా! ఈశ్వర! శిక్షకెంతయుఁ దగుదునురా
ఇంతైన పుణ్యము ♦ నేఁజేయఁగనైతి
సంతతముదుష్ట ♦ చర్యలఁజరిపితి ||ఎంత||
అంతమె లేదునా ♦ యపచారకోటికి
నెంతదండించిన ♦ నీశ్వర! నినుదూర ||ఎంత||
ఎందఱనో నిం ♦ దించినవాఁడను
గందును సుఖమని ♦ కడుస్వార్థపరుఁడనై ||ఎంత||
మోక్షమునకు శిక్ష ♦ మొట్టమొదటిమెట్టు
శిక్షయెతగుమందు ♦ చిత్తశుద్ధికి ముందు ||ఎంత||

19 కమాచ్ - ఛాపు.

ననుఁగావసమయముగా♦నామదిదోరననుఁగావసమయమురా
వినయముతో నిన్నె ♦ వేఁడుచుంటినిరా ॥నను॥
నినునాకు గతియని ♦ నెఱనమ్మియుంటిని
ననుఁగావకుంట య ♦ న్యాయముగదరా ॥నను॥
దిక్కుతోఁ చనియంత ♦ దీనుఁడనై యుంటి
నక్కటికముతోన ♦ న్నాదరింపుమురా ॥నను॥
నామొఱ వినువారు ♦ నాథ! యన్యులులేరు
ప్రేమసాగర! యు ♦ పేక్షచేయకురా ॥నను॥

---

20 భైరవి - ఆదితాళము.

ఆపద్బాంధవ ♦ అతులదయార్ణవ
ప్రాపునీవని నీ ♦ పాలఁబడితిదేవ ॥ఆప॥
పాపములెన్నెన్నో ♦ పలుమఱు సలిపితిఁ
దాపములను బడి ♦ తల్లడిల్లితిని
గోపము చూపకిఁకఁ ♦ గూర్మితో నేలుము
పాపములనుబాపు ♦ పరమపావనరూప ॥ఆప॥
ఘోరదుష్కృతములు ♦ కోటులుచేసితి
వీరభక్తుడనని ♦ వేసము వేసితిఁ
గోరఁగూడనియట్టి ♦ కోర్కెలఁగోరితి
నేరీతిఁజూపెదొ ♦ యీశ్వరనీదయ ॥ఆప॥

పంచభూతమ్ములఁ బ్రాణేంద్రియముల
నంచితబంధుల ♦ నాహారాదుల
వంచకునకునాకు ♦ వరముగనిడితివి
ఎంచగదరమౌనె ♦ యీశ్వరనీకృప ॥అప॥

ఎన్నియొకరుణించి ♦ యిచ్చినదానిని—
నెన్నకయింకను ♦ నియ్యలేదనుచు
నిన్ను నిందించిన నీచాతి ♦ నీచుఁడను
నన్ను శిక్షించెదో ♦ నాథరక్షించెదో ॥అప॥

21 శుద్ధసావేరి – ఆదితాళము.

ఇఁకనిను విడువను ♦ ఏమయిననుగాని
ప్రకటితముగ నీవె ♦ ప్రభువని తెలిసెను ॥ఇక॥

చకచకలీనెడు ♦ చంద్రసూర్యాదులు
సకలచరాచర ♦ సహితలోకమ్ములు
ప్రకటములయినీలోఁ ♦ బ్రబలుచునుండును
అకలంక తేజనీ ♦ యం దెలయించును ॥ఇక॥

అతులితసుఖముల ♦ నలరగఁజేసి
మతికిఁజోద్యమ్ముగ ♦ మహిమలఁజూపి
హితముల నెంతయు ♦ నెలమితోఁదెల్పి
సతతముఁబ్రోచెడు ♦ జననివి నీవు ॥ఇఁక॥

దోసముచేసి నీకు ♦ దూరమైపోయిన
గాసిలి హాయని ♦ కరములుమోడ్చిన
దాసులఁజేరఁదీసి ♦ తప్పులక్షమియించి
త్రాసముదీర్చెడు ♦ తండ్రివి నీవు ॥ఇక॥
అందఱు విడనాడి ♦ యరిగెడునప్పుడు
కొందలమంది మది ♦ కుందెడునప్పుడు
డెందము నిరాశతో ♦ డిందెడునప్పుడు
కుందని యుత్సాహము ♦ కూర్చెడు సఖుఁడవు ॥ఇఁక॥

---

22 ధన్యాసి ♦ రూపకతాళము.

ఎన్నికష్టమ్ములు ♦ నీశ్వర నేఁబడ్డ
నిన్నువిడువనునే ♦ నీబిడ్డ ॥ఎన్ని॥
కన్నతల్లినిజేరఁ ♦ గాసి వాసెడురీతి
నిన్నుఁజేరిన నా ♦ కన్నిబాధలుదీఱు ॥ఎన్ని॥
కన్నవారలనెల్లఁ ♦ గన్నవాఁడవు నీవు
విన్న నీకన్నను ♦ నెక్కుడెవ్వరురా ॥ఎన్ని॥
ఎప్పుడు లోపల ♦ నేకాంతముగవెల్గి
తప్పులొప్పులఁ దెల్పు ♦ తండ్రివిగదరా ॥ఎన్ని॥
నాలోనుందువు నీవు ♦ నీలోనుందును నేను
ఏలీలఁజూడ న ♦ న్నేలువాఁడవు నీవె ఎన్ని॥
ఖేదమెకానిర ♦ మోదమెకానిర
యేదైన నేమిర ♦ నీదయకదరా ॥ఎన్ని॥

## 23 మోహన - ఆదితాళము.

అంత నీ దయరా ♦ అఖిలోద్ధార ♦ అంతనీదయరా
చింతలు నీదయ ♦ చిత్తము నీదయ
వింతలు నీదయ ♦ విత్తము నీదయ ॥అంత॥
జనకుఁడు నీదయ ♦ జననియు నీదయ
జననమరణ ♦ సంసారము నీదయ ॥అంత॥
శత్రువు నీదయ ♦ మిత్రుఁడు నీదయ
పుత్రుఁడు పుత్రిక ♦ శత్రము నీదయ ॥అంత॥
గాలియు నేలయు ♦ గగనజలాగ్నులు
కాలము దేశము ♦ కష్టము నష్టము ॥అంత॥
భావము నీదయ ♦ భాషయు నీదయ
పావనతరమగు ♦ ప్రాణము నీదయ ॥అంత॥

## 24 భైరవి - ఆదితాళము.

వెదకివెదకినా ♦ హృదయములోపలి
మదాదిరిపులను ♦ వధింపరా తండ్రి! ॥వెదకి॥
త్వదీయశరణమె గ ♦ దా మదాత్మకు
ముదంబు నొసంగును ♦ సదాదయానిధి ॥వెదకి॥
నిరంతరమునన్ ♦ దురంతచింతలు
గరంబుఁగాల్చెను ♦ భరింపలేనిఁక ॥వెదకి॥

పరాత్పరా నిను ♦ నిరాటంకముగ
స్మరించుటకు నవ ♦ సరంబు దొరకురా ॥వెదకి॥
స్మరించి నిన్నను ♦ సరించినీతినిఁ
జరించి భవములఁ ♦ దరింపనేర్తును ॥వెదకి॥

25 ఆనందభైరవి – చాపు.

ఆనందామృతము నీ ♦ యాత్మలో ప్రవహింప
నందు నీమది ముంప వేల ♦ ముంప వేల?
మానసేంద్రియముల ♦ మంచిత్రోవకుఁద్రిప్పి
ప్రాణేశుదయఁగాంచ వేల ♦ కాంచ వేల? ॥ఆనం॥
దానముగా నెన్నో ♦ దైవము దయసేయ
దీనులకును నియ్య వేల ♦ యియ్య వేల?
మానవకోటికి ♦ మానము దెచ్చెడు
మానవంతులఁగూడ వేల ♦ కూడ వేల? ॥ఆనం॥
భావములోపలఁ ♦ బరితాపాగ్నినిగొల్పి
పాపములను గాల్ప వేల ♦ కాల్ప వేల?
పావనమూర్తిని ♦ వరశుభకీర్తిని
భక్తిమీఱఁగఁ బాడ వేల ♦ పాడ వేల? ॥ఆనం॥
నమ్మఁగూడనివారి ♦ నమ్మి ధర్మమ్మును
వమ్ముచేయుచునుందు వేల ♦ ఉందు వేల?
నెమ్మదిలోవిభు ♦ నమ్మినవారికే
నెమ్మదియని నమ్మ వేల ♦ నమ్మ వేల? ॥ఆనం॥

26 కల్యాణి - ఛాపు.

రమ్ము నాహృదయమ్మును ♦ ప్రాణేశ నై
కొమ్ము నీగృహముగను
నెమ్మి నీకయి నేను ♦ నిరతము వేచితి
వమ్ము చేయకు నా ♦ వాంఛితార్థమునిమ్ము ॥రమ్ము

శాంతి నికేతనమా ♦ సర్వోత్తమ
సుంత నీదయకల్గిన
వింతగ సద్గుణ ♦ వితతిచే నొప్పారి
స్వాంతము పరిపూర్ణ ♦ స్వర్గధామంబగు ॥రమ్ము॥

సర్వేశ్వర శ్రీకర ♦ సర్వాధార
సర్వసద్గుణసాగరా
సర్వము లోపల ♦ స్వామి నీమహిమనె
సర్వదా చూచెడు ♦ శక్తినియ్యవె చాలు ॥రమ్ము॥

ఎన్నిసుఖములఁగూర్చితో యెలమిని నాకు
నెన్నశక్యమె యీశ్వరా
సన్నుతింపఁగనేర ♦ స్వామి నీకరుణను
మన్నమస్కృతులివె ♦ మన్నించికొనవే ॥రమ్ము॥

27 కమాచ్ - ఛాపు.

ఎడబాసి యుండలేను ఈశ్వర! నిన్ను
నెడఁబాసియుండలేను ॥ఎడ॥

తడవాయె నినుఁజూచి ♦ తాళగలేనింకఁ
గడువడిరాకున్నఁ ♦ గార్యముదప్పును ॥ఎడ॥
విభునినిన్నుఁజూడ ♦ వేడుకగలిగెను
అభయమిచ్చినన్ను ♦ నాదరింపుము స్వామి ॥ఎడ॥
ప్రేమాస్వరూప! యు ♦ పేక్షచేయకు మింక
నామదిలోనిండిన ♦ న్నలరింపుము ॥ఎడ॥

---

28 కళావతి - ఆదితాళము.

ననుఁగన్నతండ్రి ♦ నన్నువీడకే
నిన్నేకాని గతిగా ♦ నెన్న నెవ్వరిని ॥నన్ను॥
ఎన్నికష్టముల ♦ నున్న నిన్నెమదిని
నెన్నికొల్చుశక్తి ♦ నిచ్చి కావవే ॥నన్ను॥
అలుక లేనియట్టి ♦ యధిపుఁడంచు నిన్నుఁ
బలుకుచుండ భక్త ♦ వరులు వింటినే ॥నన్ను॥
పాపజాలములు ♦ పట్టిలాగు వేళ
ప్రాపు నీవై నన్నుఁ ♦ బట్టిప్రోవవే ॥నన్ను॥
సుగుణరాశివౌ నీ ♦ సుతుఁడనౌట యెఱిఁగి
తగినరీతిమెలఁగు ♦ దారిఁజూపవే ॥నన్ను॥

## 29. శహానా – ఛాపు.

ప్రభునిమఱచితివేలె ♦ పాపపుమనసా
శుభదృష్టితో నిన్నుఁ ♦ జూచునుగదవే ॥ప్రభు॥
విభుదయలేకున్న ♦ విశ్వములోన
విభవములెవ్వైన ♦ విలసిల్లగలవె ॥ప్రభు॥
నీవుపుట్టకమున్నె ♦ నీకయి దయతోఁ
గావలసినవెల్లఁ ♦ గల్పించెగదవే ॥ప్రభు॥
శరణని యాప్రభు ♦ మఱుఁగునఁజేర
దరిలేని దుఃఖాబ్ధి ♦ దాఁటించుఁగదవె ॥ప్రభు॥
తలఁపులోపలనుండి ♦ ధర్మమెచూపి
పలుతెఱఁగుల నిన్నుఁ ♦ బాలించుఁగదవె ॥ప్రభు॥
కరుణాదిసద్గుణ ♦ గణమణిఖనియై
పరిపరివిధముల ♦ బాసిల్లుఁగదవె ॥ప్రభు॥

---

## 30 కమాచ్ – ఛాపు

నీవంటి వాఁడుకలఁడా నిజముగఁజూడ నీవంటి వాఁడుకలఁడా
సేవించువారల ♦ చింతలెల్లనుదీర్చి
కేవలానందము ♦ కృపతో నొసంగుదువు ॥నీ॥
భావమునందలి ♦ పాప చింతలఁదోలి
పావనముగఁజేయు ♦ పరమపావనుఁడవు ॥నీ॥

తల్లిదండ్రులకంటె ♦ దాత నేతలకంటె
నెల్ల సఖులకంటె ♦ నెంతయుఁ బ్రియుఁడవు ॥నీ॥

కావలసిన వెల్లఁ ♦ గరుణతో నొదిగించి
సేవకునివలెఁ ♦ జెంత నెనిలుతువు ॥నీ॥

---

## 31. తోడి - చాపు.

ఏలా నిరాశ? ఈశ్వరుఁడుండ ఏలా నిరాశ?
పాలించు నినునతఁడు ♦ భయపడకుము మనస॥ఏలా॥

లీలతో జగముల ♦ నేలుచుండియునతఁడు
నీలోనే యున్నవాఁడు ♦ నినువిడువఁడు ॥ఏలా॥

పతితపావన బిరుదు ♦ పడసినవాఁడతఁడు
అతనికంటెను హితుఁ ♦ డన్యుఁడెవ్వఁడు లేఁడు ॥ఏలా॥

సుఖదుఃఖముల వంకఁ ♦ జూచుచుందువ దేల
సఖుని నాతనిఁగొల్వ ♦ సర్వము సుఖమగు ॥ఏలా॥

అన్నిజాతులవారి ♦ నన్నిమతములవారి
నన్నిస్థితులవారి ♦ నరసిరక్షించును ॥ఏలా॥

## 32. ముఖారి - ఆదితాళము.

నిఖిలజగము లేలు ఱేఁడు ♦ నిన్ను నేలకుండునా?
నిఖిలమెఱుఁగుసర్వసాక్షి ♦ నిన్ను నెఱుఁగకుండునా?
||నిఖిల||
నిఖిలజీవరక్షకుండు ♦ నిన్నుఁగావకుండునా?
నిఖిలభువననాయకుండు♦నిన్ను నడుపకుండునా? ||నిఖిల||
నిఖిలమతనికి నప్పగింప ♦ నిన్ను మెచ్చకుండునా?
నిఖిలమతని దయవేఁయనిన ♦ నీకు దుఃఖముండునా?
||నిఖిల||
నిండియంతటనుండువాఁడు ♦ నీలోనుండకుండునా?
నిండుమదినినతనిఁగొల్వ ♦ నీకులోపముండునా?||నిఖిల||

---

## 33. జంఝూటి - ఆదితాళము.

వదలి కుమార్గము ♦ వరమార్గమ్మున
వర్తిలుచుండవె ♦ యోమనసా
సదమలభక్తిని ♦ స్వామినిగొలుచుచు
సౌఖ్యములందవె ♦ యోమనసా ||వదలి||
పరులసుఖమునే ♦ పాటించుచుభువిఁ
బనులొనరింపవె ♦ యోమనసా
దురితదవాగ్నిని ♦ దూఁకుచుదారుణ
దుఃఖములందకె ♦ యోమనసా ||వదలి||
సత్యమె సర్వ ♦ శ్రేయస్కరమని

సతతమెఱుంగవె ♦ యోమనసా
సత్యవ్రతమును ♦ సలిపెడునప్పుడె
శౌర్యముఁజూపవె ♦ యోమనసా ॥వదలి॥

న్యాయమె స్వర్గ ♦ ప్రాయముజగతిని
నమ్ముము ధృఢముగ ♦ నోమనసా
న్యాయముదప్పిన ♦ నరకంబుగభువి
నాఁడేమాఱునె ♦ యోమనసా ॥వదలి॥

సుగుణరత్నముల ♦ సొగసుగఁదాల్చి
శోభిలుచుండవె ♦ యోమనసా
అగణితగుణ ర ♦ త్నాకరుఁడగు పర
మాత్మయె శరణము ♦ వినుమనసా ॥వదలి॥

---

## 34 మధ్యమావతి – ఆదితాళము.

మరి రాదుర యీ ♦ మానుషజన్మము
పరమపురుషుకృప ♦ వలననె కలిగెను ॥మరి॥

పరమేశుని వౌ ♦ పరమాద్భుతముల
దరిసెనమొనరింపఁ ♦ దగుయంత్రం బిది ॥మరి॥

పరిపరివిధములఁ బరులకు హితములఁ
దఱినిజేయ సా ♦ ధనరాజమ్మిది ॥మరి॥

ఘనసద్గుణమణి ♦ గణము గడింపఁగ
మనకు లభించిన ♦ మహితధనమ్మిది ॥మరి॥

దేవుని జేర్పఁగ ♦ జీవుని గొని చను
దేవదత్తమా ♦ దివ్యరథం బిది ॥మరి॥

కాని దీనిఁ జెడు ♦ కార్యములం దిడు
వానిజన్మ మిల ♦ వ్యర్థము వ్యర్థము ॥మరి॥

## 35 పంతువరాళి - చాపు.

ప్రాతఃకాలం బయ్యె ♦ భక్తులారా లెండు
చేతుల జోడింతము ♦ శ్రీకరుఁదలఁచి ♦ చేతులజోడింతము ॥ప్రా॥

రాతిరి యేకీడు ♦ రాకుండ రక్షించి
ప్రీతి నెంతయుఁ జూపెను ♦ ప్రియతమవిభుఁడు
ప్రీతినెంతయుఁ జూపెను ॥ప్రాతః॥

బడలియుండినమన ♦ యొడలికి బలమును
గడుదయ నొడఁగూర్చెను ♦ కరుణానిధి
కడుదయనొడఁగూర్చెను ॥ప్రాతః॥

మందమందమ్ముగ ♦ మారుతమ్మును గొల్పె
నందఱ లేపంగను ♦ ఆనందజలధి ♦ యందఱ లేపంగను॥

ఇంపుగఁ గూయుచు ♦ హెచ్చరికలు దెల్పఁ
బంపెఁ బిట్టలగుంపుల ♦ ప్రాణేశుఁడు ♦ పంపెఁ బిట్టలగుంపుల॥

చిమ్మచీఁకటి ముగ్గి ♦ చెన్ను దప్పినభువిని
గమ్ముఱ వెలిఁగించెను ♦ కమనీయకీర్తి ♦ కమ్ముఱవెలిఁగించెను॥

చేతనాత్మకములై ♦ చెలఁగంగఁజొచ్చెను
భూతజాలములెల్లను♦భువనేశుదయను♦భూతజాలములెల్లను॥
ఆలసింపకుఁ డింక ♦ ఆప్తులారా లెండు
ఆలించి సేవింతము ♦ ఆప్రభునాజ్ఞ♦ఆలించి సేవింతము ॥ప్రా॥

## ౩౬ కురంజి ♦ ఆదితాళము.

సంజ యెంతయు మంచి ♦ సమయము కాదా
ప్రాంజలిఁ గూర్చి ప్రభు ♦ ప్రార్థన సలుప ॥సంజ॥
మంజులఫణితిని ♦ మానసకల్మష
భంజను భక్తజన ♦ రంజనుఁ బొగడ ॥సంజ॥
శాంతుఁడై రవి యస్త ♦ శైలపీఠముఁ జేరి
శాంతి గొల్పునుగద ♦ స్వాంతములందు ॥సంజ॥
పంకజాతమ్ములు ♦ భక్తిని దల వంచి
సంకటహరునకు ♦ సలుపు నమస్కృతి ॥సంజ॥
చుక్కలు నింగిపై ♦ నెక్కి యుప్పొంగుచు
చుక్కవతో విభు ♦ మహిమను జాటు ॥సంజ॥
మాని రొదలు పక్షుల్ ♦ మానముతో విభు
ధ్యాన మొనర్చును ♦ దమతమగూండ్ల ॥సంజ॥
కామక్రోధాదులు ♦ గర్వ ముడిగి మన
స్వామిని సేవింప ♦ సాయపడునుగద ॥సంజ॥

## 37 హిందూస్థానిభైరవి - రూపకము.

విశ్వవిభునిధ్యానము ♦ విమలముక్తిసోపానము
శాశ్వతసుఖసంధానము ♦ సకలఋషివిధానము ॥విశ్వ
కామక్రోధలోభముల్ ♦ కఠినశత్రుజాలముల్
నేమముతో వాని నడుప♦నిజము చెదరు దురితముల్ ॥విశ్వ॥
చిత్తమం దసూయ పుట్టి ♦ చిచ్చువోలె మండకుండ
నుత్తమశాంతస్వభావ ♦ మూనియుండుము నిరతము ॥విశ్వ॥
మిత్రదృష్టితోడఁ బ్రాణి ♦ మాత్ర మెపుడు చూడుము
పాత్రవర్తన గల్గి జీవన ♦ యాత్ర సలుపఁగడఁగుము ॥విశ్వ॥
జగము నద్భుతంబుగా ♦ సలిపి యేలువానికంటె
జగతి నధికుఁ డెవఁడు లేఁడు♦శరణ మతనిఁబొందుము ॥విశ్వ॥

---

## 38 కన్నడ - ఛాపు.

అతనిఁ గన్గొనరే
అతులితసుఖరూపు ♦ నంతర్యామిని ॥అతని॥
మితిలేనిశుభముల ♦ సతతము వర్షించు
పతిని సర్వోత్తముని ♦ భక్తవత్సలుని ॥అతని॥
పలువిధములసూక్ష్మ ♦ పరమాణువులఁ గూర్చి
బలుసొంపునింపుప్ర ♦ పంచము చేసెడు ॥అతని॥
జగతిలోపలిజంతు ♦ జాలము వర్ధిల్ల
తగినయాహారముల్ ♦ దయతోనొసంగెడు ॥అతని॥

జీవులకోరికల్ ♦ చెల్లింప సమకట్టి
కేవలాద్భుత దేహ ♦ గృహము లొసంగెడు ||అతని||
నిర్మలధర్మమున్ ♦ నిరతము కాపాడు
ధర్మాత్ములకెల్ల ♦ ధైర్య మొసంగెడు ||అతని||

---

## 39. మాయామాళవగౌళ-ఆదితాళము.

పరమపురుషుఁడగు దేవు కడు ♦ భక్తినిగొల్వుమునీవు 1
పరిపూర్ణుఁ డనంతుఁడతండు ♦ కరుణాళువుసర్వవిదుండు
పరిశుద్ధగుణంబులబ్రోవు మన ♦ భావముఁజూచెడు దేవు. ౨
వివిధవిచిత్రపుసృష్టి ♦ విరచించివెలింగెడునట్టి
అవినాశునినిర్మలు దేవు మన ♦ మందుఁదలంపుమునీవు ౩
దురితమ్ములనుండితొలంగి సం ♦ తోషముతోడనుబొంగి
దరిఁజేరఁగఁగోరిననీవు గుణ ♦ ధ్యానముచేయుము దేవు, 4

---

## 40. బేహాగ్ ♦ ఆదితాళము.

భజింపుఁ డతని సదా ♦ భవాబ్ధి సుఖముగఁ దరింపఁగోరిన
భజింపుఁ డతని సదా
నిజానుచరులను ♦ నిరంతరంబును
వ్యజింప కరసెడు ♦ దయాస్వరూపుని ||భ||
చరాచరంబుల ♦ జగద్గణంబుల
భరించుచుండెడు ♦ ప్రభూత్తమోత్తము ||భ||

9 మునీంద్రనిర్మల ♦ మనోంబరంబున
ఘనంబుగా వెల్గు ♦ దినేంద్రమూర్తిని ॥భ
అనంతసుఖముల ♦ ననంతజీవుల
కనుగ్రహించెడు ♦ ననంతమహిముని ॥భ॥

---

## 41. హిందూస్థాని భైరవి – చాపు.

నేఁడు మనమందఱము కూడి ♦ పాడుదము పరమేశుని
ఈడు జగమున లేక యంతట
హెచ్చి వెలిఁగెడు జ్యోతిని ॥నేఁడు॥
కందరమ్ముల మందిరమ్ముల ♦ గహనపర్వతసీమల
సుందరధ్వనితోడ యోగులు ♦ స్తుతియొనర్చెడు దేవుని ॥నేఁడు॥
చెట్టుచెట్టునఁ గాననంబునఁ ♦ జెలఁగుమధురరుతంబులఁ
బిట్ట లెవనిని బాడుచుండునొ ♦ ప్రీతిసాగరు నాతని ॥నేఁడు॥
నూతులందును చెఱువులందును ♦ లోఁతు తెలియని జలధిలో
శీతజలమును ద్రావి కీర్తన ♦ చేయు జలచర మ్మాతని ॥నేఁడు॥
ఉత్సవంబుల నుల్ల మలరఁగ ♦ నువిద లెవ్వనిఁ బాడుచు
నుత్సహింతురొ యాదయామయు♦నుత్తమోత్తమపురుషుని॥
శూరులును వీరాతివీరులు ♦ శుద్ధహృదయాంబుజముల
సారెసారెకు నెవనిఁ దలఁతురొ♦సత్స్వరూపుఁబరేశుని ॥నేఁడు॥

42 శుద్ధసావేరి - చాపు.

సేవింతము రండు ♦ దేవదేవేంద్రుని
కేవలానందనిధిని ♦ కైవల్యధనుని ॥సే॥

ఏవంకఁ జూచిన ♦ నావంక నావిభు
పావనచిహ్నములె ♦ భాసిల్లుచుండును ॥సే॥

భావించి యాప్రభు ♦ భవ్యగుణమ్ముల
సేవించువారికిఁ ♦ జింతలెల్లను దీఱు ॥సే॥

చండసూర్యుఁడు గూడ ♦ సన్నమిడుఁగురుఁ బోలు
నిండారువిభునిప్ర ♦ చండతేజముముందు ॥సే॥

పూర్ణ చంద్రుఁడు గాజు ♦ ముక్కకైనను దగఁడు
పూర్ణుఁడౌవిభునిసం ♦ పూర్ణకీర్తికి ముందు ॥సే॥

ప్రభ దప్పి తుంపరల్ ♦ పగిదిఁ దోఁచును నదుల్
విభునిదయామృత ♦ విమలపూరముముందు ॥సే॥

43 మధ్యమావతి - చాపు

రండు మనహృత్పీఠమున బ్ర ♦ హ్మాండనాథుండు
నిండుకొలువుండంగ వచ్చెను ♦ లెండు లేలెండు ॥రండు॥

సుగుణమణిగణతోరణంబుల ♦ సుందరంబుగఁ గట్టుఁడు
నెగడుపరమోత్సాహధ్వజమును ♦ నింగి ముట్టఁగ నిల్పుఁడు॥

భవ్యతరముగ నొప్పదయయను ♦ పట్టుగొడుగును బట్టుఁడు
దివ్యవిజ్ఞానప్రదీప్తులఁ ♦ దేజరిల్లఁగఁ జేయుఁడు ॥రండు॥

శాంతిసత్యము లనెడు తెల్లని ♦ చామరంబుల వేయుఁడు
చెంతదుర్గుణగణము లెవ్వియుఁ ♦ జేరకుండఁగఁ దఱుముఁడు॥
వినుతు లనియెడువిరులవానను ♦ విరివిగాఁగురియింపుఁడు
ఘనతరంబుగఁ బ్రాలుభక్తిని ♦ గానుకగా నర్పింపుఁడు ॥౨౦॥

## 44 బేహాగ్ — ఆదితాళము.

పరమపితా మా ♦ ప్రార్థన వినురా
పాపములోఁ బడ ♦ నీయకురా
శరణాగతర ♦ క్షకుఁడని నిన్నే
శరణుచొచ్చితిమి ♦ విడువకురా ॥పరమ॥
పరులను మావలె ♦ భావించెడు మదిఁ
బరమాత్మా మా ♦ కొసఁగుమురా
నిరతము నంతట ♦ నీమహిమలఁ గను
నిరుపమవిద్యను ♦ నేర్పుమురా ॥పరమ॥
నీయాజ్ఞలనే ♦ నెఱవేర్పఁగ మది
నిర్మలభక్తిని ♦ గొలుపుమురా
న్యాయసత్యకరు ♦ ణాలయ మాలో
నమ్రతనాట్యము ♦ సల్పుమురా ॥పరమ॥
శాంతిధామ మా ♦ స్వాంతమునందలి
చింతల నీ వెగఁ ♦ జిమ్ముమురా
అంతరంగ మను ♦ నరవిందము నీ
కెంతయుఁ బ్రీతి న ♦ ర్పింతుమురా ॥పరమ॥

## 45 అఠాణా - ఛాపు.

బుద్ధిపై పొరఁదీయరా ♦ భువనేశ్వర ♦ బుద్ధిపై పొరఁదీయరా
శుద్ధమగునీసత్స్వరూపముఁ ♦ జూచి చూచి కృతార్థులగుదుము
శ్రద్ధతో నీసేవలొనరిచి ♦ శాశ్వతానందమ్ముఁగాంతుము॥బు॥
భక్తిభిక్షము పెట్టరా ♦ ప్రాణేశ్వర ♦ భక్తిభిక్షము పెట్టరా
సక్తిమీఱఁగఁ బాపచయములఁ ♦ జక్కఁగాఁజెండాడివైతుము
రక్తితో మాహృత్పురంబును ♦ రాజధానిగనీకునిత్తుము ॥భ॥
దయను మాపయిఁ గురియరా ♦ దయాకర
దయను మాపయిఁ గురియరా
దయను మాపయి నీవు గురిసినఁ ♦ దాపములు చల్లారిపోవును
రయముగా హృత్క్షేత్రములస ♦ ద్రమ్యగుణములపంటపండును॥
ఐకమత్యముఁగూర్పరా ♦ అఖిలాధార♦ఐకమత్యముగూర్పరా
లోకమంతయునీకుటుంబము♦లోని దే యని తెలిసి మెలఁగుచు
నీకటాక్షముచేతవర్ధిలి ♦ నిఖిలసుఖములఁబడయుచుందుము॥ఐ॥

## 46 బేగడ - ఆదితాళము.

కనుఁగొంటిని ♦ కనులపండువుగాఁ గనుకొంటిని
కనికరంపుగనివై ♦ క్రాలుచుండు నిను ॥కను॥
జనన మిచ్చి ప్రీతి ♦ స్తన్యపాన మొసఁగి
మనిచినట్టినాదు ♦ మాతయందు నిన్ను ॥కను॥
నయభయమ్ములచే ♦ నాహితమ్మె కోరి
దయను జూపినట్టి ♦ తండ్రియందు నిన్ను ॥కను॥

మఱవరానినీదు ♦ మహిమ లెన్నో నాకుఁ
గరుణఁ దెల్పినట్టి ♦ గురునియందు నిన్ను ॥కను॥
మాయలేనితనము ♦ మాకుఁ జూపుటకును
నీయొసంగినట్టి ♦ నిసువులందు నిన్ను ॥కను॥
చింత నున్నవేళఁ ♦ జెంతఁ జేరి నాకు
సంతసమ్ము నిడిన ♦ సఖులయందు నిన్ను ॥కను॥

## 47 నారాయణి - చాపు.

కరుణామృతపూరమా ♦ పరంధామ
కరుణామృతపూరమా
శరణు చొచ్చినవారిపాలికి ♦ నరయ సుందరపారిజాతమ
పరమసుగుణసముద్రమా మునివరులకునునిను బొగడఁదరమా
సర్వేశ్వర శ్రీకర ♦ సర్వాధార ♦ సర్వేశ్వర శ్రీకర
సర్వదుర్గుణములకు లోఁబడి ♦ గర్వమునఁ గనుగానకుండెడు
దుర్వినీతులఁ బట్టి దిద్దెడు ♦ సర్వశక్తుఁడ వీవె దేవర ॥సర్వే॥
న్యాయపాలనభూషణ♦అన్యాయశోషణ♦న్యాయపాలనభూషణ
న్యాయమునవర్తించువారల♦కేయమేయసుఖంబులొసఁగుచు
న్యాయమును బ్రకటించుసుజన♦ధ్యేయనిరుపమపరమపావన॥
సత్యవ్రతధారక ♦ శాంతిప్రసారక ♦ సత్యవ్రతధారక
నిత్యసుఖధర్మప్రచారక ♦ నిరుపమానందైకకారక
సత్యదీక్షాచరణపూరక ♦ సాధుతాపత్రయనివారక ॥సత్య

### 48 గాఫి ♦ చాపు.

తామసమేల స్వామి ♦ తనయుని నేల వేమి
నామొఱవిన వేమి ♦ నాగతి యేమి ॥తామ॥

వేమఱు వేఁడిన ♦ వెక్కి నేనేడ్చిన
నీమది కెక్క దేమి ♦ నేరమ దేమి ॥తామ॥

అందఱనాదరించు ♦ నతికృపామతివని
యందరుపల్కుట ♦ యనృతమ యేమి ॥తామ॥
ఎందఱనో యుద్ధ ♦ రించినవాఁడవె
అందఱకంటెను ♦ నధముఁడ నాయేమి ॥తామ॥

దిక్కు నీవేయంటి ♦ దీనుఁడ నేనంటి
నక్కటనన్నువిడ ♦ నాడకుమంటి ॥తామ॥

---

### 49 బేహాగ్ - ఆదితాళము.

దరిసెన మియ్యరా ♦ ధన్యులఁ జేయరా
పరమదయాకరా ♦ పాపనివారా ॥దరి॥

మముఁ గృపఁజూడరా ♦ మామొఱ వినరా
సుమనోమనోహరా ♦ శుద్ధవిచారా ॥దరి॥

రార మామదిదార ♦ రాజ్యము సేయరా
కోరికలతిత్వరఁ ♦ గొల్లగఁబండురా ॥దరి॥

చింతలఁ దీర్పరా ♦ చిత్తాబ్జభాస్కరా
సంతాప మార్పరా ♦ శాంతిసుధాకరా ॥దరి॥

50 మోహన ♦ ఆదితాళము.

నిరుపమానందము ♦ నిజముగఁ గల్గును
పరమపురుషుసేవ ♦ భక్తితో సల్పిన ||నిరు||

దురితములెల్లను ♦ దూరమైపోవును
కరుణాదిసద్గుణ ♦ గణము లభించును ||నిరు||

పలుకులఁ దేనియ ♦ లొలుకఁ దొడంగును
తలఁపుల నొకవింత ♦ తెలివి చెలంగును ||నిరు||

వదనము తేజో ♦ వంతమై యొప్పును
పొదలు దేహమునిండఁ ♦ బులకలు పొడమును ||నిరు||

చూపుల నమృతంపు ♦ సోనలు గురియును
ఆపరమేశుఁడె ♦ యంతటఁదోచును ||నిరు||

---

51 కాంభోజి – రూపకతాళము.

జయదేవా జయదేవా ♦ జయ త్రిభువనకర్తా
ప్రభు జయ త్రిభువనకర్తా
జయ సర్వాశ్రయదాతా ♦ భయసంకటహర్తా||జయ||

నీమహిమనె కొనియాడును ♦ నిఖిలచరాచరతతులు
ప్రభు నిఖిలచరాచరతతులు
నీముందటఁదలవంతురు ♦ నిఖిలోర్వీశులు ప్రజలు||జయ||

వర్ణింపఁగఁ దరమే నిన్నుఁ ♦ బరమదయాకరమూర్తి
ప్రభు పరమదయాకరమూర్తి
పూర్ణముగా వెలుఁగొందును♦భువిదివినీశుభకీర్తి ॥జయ॥

చేతనము లచేతన మయి ♦ చెలఁగుదు వంతటను
ప్రభు చెలఁగుదు వంతటను
ప్రీతిని బహిరంతరముల ♦ వీక్షింతువు సతము ॥జయ॥

నీజ్ఞానమె నలుగడలను ♦ నిగ గమని వెలుగఁ
ప్రభు నిగనిగ మని వెలుఁగ
సుజ్ఞానులుస్త్రీపురుషులు♦చూతురుచోద్యముగ ॥జయ॥

వర్ణింపఁగఁదరమేనీ ♦ పరమాద్భుతశక్తి
ప్రభు పరమాద్భుతశక్తి
చూర్ణముచేయుముగర్వము♦సురుచిరశుభసూక్తి॥జయ॥

అక్షయమగునుత్సాహం ♦ బమరెడు నీసేవా
ప్రభు అమరెడు నీసేవా
భిక్షముగాఁగోరితి నిడు ♦ ప్రేమాస్పద దేవా ॥జయ॥

52 సురటి - ఛాపు.

మంగళంమంగళంమాప్రభునీకుమంగళంమంగళం॥మం॥

శృంగారమగుసృష్టి ♦ చిత్రముగాఁ జేసి

నింగి నేల నిండి ♦ పొంగి రంగారుచు

తుంగమహిమతో ♦ వెలింగెడు దేవా ॥మంగళం॥

నీయాజ్ఞ పాలించు ♦ నీతివర్తనులకు

నీయానందమె యిచ్చి ♦ నెటఁ బ్రోచినీదు

న్యాయమెప్రకటించు ♦ మాయయ్యనీకు ॥మంగళం॥

సదములమగునీదు ♦ సద్గుణపుంజము

ముదముతో నొదవించు ♦ మదితోడ మాదా

హృదయాబ్జమందున ♦ నుదయించుతండ్రీ ॥మంగళం॥

# ఆర్యావర్తము.

---

సీ. రత్నకిరీటమై ♦ రంజిల్లు నెద్దాని
శీర్షభాగంబున ♦ శీతనగము
ఆణిముత్తెమ్ముల ♦ హారమై యెద్దాని
కంఠానకొప్పు గం ♦ గాభవాని
కమనీయతరమైన ♦ కాంచియై యెద్దాని
కటిఁ గ్రాలు వింధ్యన ♦ గంపుఁజాలు
చిత్రచేలంబయి ♦ చెన్నారు దేనిపై
సర్వసస్యాఢ్యయా ♦ సారభూమి

గీ. దేనిపదపీఠమైలంక ♦ తేజరిల్లు
వీచికలదేని నిరువంక ♦ వీచువార్ధి
దేనిసిరివింతగొల్పు వి ♦ దేశతతికి
నద్దిభూమండలికి రాణి ♦ ఆర్యధాని.

సీ. కర్ణాదిదాతలఁ ♦ గడుపారఁగాఁగన్న
యతిపూతచరిత యీ ♦ యార్యమాత
సత్యసంధుల హరి ♦ శ్చంద్రాదులనుగన్న
యతిపూతచరిత యీ ♦ యార్యమాత

భీష్మాదిభక్తులఁ ♦ బ్రేమమీఱఁగఁగన్న
యతిపూతచరిత యీ ♦ యార్యమాత
రామకృష్ణాదుల ♦ రవితేజులనుగన్న
యతిపూతచరిత యీ ♦ యార్యమాత

గీ. ధన్యుల శుకాది బ్రహ్మవే ♦ త్తలనుగన్న
యతులపరిపూతచరిత యీ ♦ యార్యమాత
సీత మొదలగు సాధ్వులఁ ♦ బ్రీతిఁగన్న
యతులపరిపూతచరిత యీ ♦ యార్యమాత

సీ. పిదికినకోలఁదిని ♦ బాదుగు చేపుచునుండు
కామధేనువనంగఁ ♦ గ్రాలినావు
ఆశ్రయించినవారి ♦ కన్నిసౌఖ్యములిచ్చు
నమర భూజమనంగ ♦ నమరినావు
సేవించువారల ♦ చింతలెల్లనుదీర్చు
చింతామణియనంగఁ ♦ జెలఁగినావు
శ్వేతోన్నతంబగు ♦ శీతనగంబను
నైరావతముచెంత ♦ నలరినావు

## ఆర్యావర్తము.

గీ. గంగనమృతతరంగను ♦ గాంచినావు
పండువెన్నెలలకు బేరు ♦ పడసినావు
స్వర్గమేనీవు నీకంటె ♦ స్వర్గమున్నె?
యఖిలసుగుణాగణోపేత! ఆర్యమాత!

సీ. అన్నిజాతులవార ♦ లన్యోన్యమైత్రితో
మెలఁగుచు నెంతయుఁ ♦ జెలఁగుటకును
అన్ని దేశములవా ♦ రన్యోన్యమైత్రితో
మెలఁగుచు నెంతయుఁ ♦ జెలఁగుటకును
అన్నిమతాలవా ♦ రన్యోన్యమైత్రితో
మెలఁగుచు నెంతయుఁ ♦ జెలఁగుటకును
అన్నితత్త్వములవా ♦ రన్యోన్యమైత్రితో
మెలఁగుచు నెంతయుఁ ♦ జెలఁగుటకును

గీ. కడువెలింగెడు రమ్యరం ♦ గమ్ముగాఁగ
సృష్టి ప్రతిబింబమనునట్టు ♦ లీశ్వరుండు
నిన్నునిర్మించియున్నాఁడు ♦ నేర్పుమీఱ
నఖిలసుగుణాగణోపేత! ఆర్యమాత!

సీ. వివిధసంపదలచే ♦ వింతగా విలసిల్లి
శ్రీమహాలక్ష్మివై ♦ చెలఁగినావు
వివిధభాషలచేత ♦ వింతగా విలసిల్లి
యలసరస్వతివయి ♦ యలరినావు
వివిధదృశ్యమ్ముల ♦ వింతగా విలసిల్లి
పార్వతీసతివయి ♦ పరఁగినావు
వివిధవైభవముల ♦ వింతగా విలసిల్లి
యెలమినింద్రాణివై ♦ యెసఁగినావు

గీ. పరమసౌభాగ్య వతివయి ♦ ప్రబలినావు
ఇట్టి నీగర్భమందు జ ♦ న్మించినీకు
సేవచేసెడు జన్మమ్ము ♦ శ్రీకరమ్ము
అఖిలసుగుణాగణోపేత! ♦ ఆర్యమాత!

జిల్లా కాంగ్రెస్ సంఘము కర్నూలు జిల్లా.



| ఏ. అగ్బరల్లి సాహెబుగారు | రాచమశెట్టి శివయ్యగారు | పోలా వేంకట గురవయ్యగారు |
| --- | --- | --- |
| కోవెలకుంట్ల. | బండి ఆత్మకూరు. | నంద్యాల. |

# జీవకారుణ్యము.

---

జీవకారుణ్యమునుగూర్చి మహాశయులనేకులు పాటుపడుచున్నవారు. దక్షిణ హైదరాబాదునందు లాల్ జీ మేఘజీగారును, అభయార్థి నంజుండప్పగారును, భాగ్యరెడ్డి వర్మగారును; సికందరాబాదునందు శ్యామరావుగారును, బాజీకృష్ణరావుగారును; మైసూరు సంస్థానమందు ఆర్యమూర్తిగారును; వాయల్పాడునందు చింతల రఘురాధరెడ్డి వర్మగారును; నాగిరెడ్డిపాలెమునందు వేంకటస్వామి రెడ్డిగారును పరిగిలో నారాయణ రాజుగారును; నంద్యాలలో పోలా వేంకట గురవయ్య శ్రేష్ఠిగారును; బండి యాత్మకూరులో రాచమశెట్టి శివప్పగారును; కోవెలకుంటలో శింగారెడ్డి తిమ్మారెడ్డిగారును, ఏ. ఆగ్బరల్లి సాహేబుగారును మిక్కిలి పట్టుదలతోఁ బనిచేయుచున్నవారు. వీరందఱు మనకు వంద్యులే.

కాని మహమ్మదీయులయందు జన్మించినను హిందువులకంటె నెంతయో పట్టుదలతో జీవకారుణ్యమునుగూర్చి పాటుపడుచు ననేకకష్టములకోర్చి యెన్నియో జాతరలయందుఁ బశుహింసను దొలఁగించుటయేగాక యెందఱనో మాంసాహారులను శాకాహారులుగా మార్చియుండు శ్రీ ఆగ్బరల్లీ సాహేబుగారి సత్కార్యదీక్ష యెంతయు గొనియాడఁదగియున్నది. మఱింత శ్రద్ధాభక్తులతో నీ జీవకారుణ్యమును గూర్చి పనిచేయుటకుఁ బరమ కరుణాళువగు పరమేశ్వరుఁడు వీరికి దీర్ఘాయురారోగ్య భాగ్యములను బ్రసాదించును గాక.

# జీవకారుణ్యము.

---

సీ. ఈదేశమునను జ ♦ న్మించియాబుద్ధుండు
పశుహింసమాన్పంగఁ ♦ బాటుపడియె
ఈదేశమున బస ♦ వేశ్వరుండుదయించి
పశుహింసమాన్పంగఁ ♦ బాటుపడియె
ఈదేశమునఁబుట్టి ♦ శ్రీదయానందుఁడు
పశుహింసమాన్పంగఁ ♦ బాటుపడియె
ఇంకనునెందఱో ♦ యీదేశమునఁగల్గి
పశుహింసమాన్పంగఁ ♦ బాటుపడిరి

l. పలువురు మహాత్ములిట్టులు ♦ పాటుపడియు
హింస యీదేశమునఁ నశి ♦ యింపదయ్యె
పాపమునకింతపంతంబు ♦ పాడియగునె?
మిత్రవరులార! యీశ్వర ♦ పుత్త్రులార!

సీ. వివిధశాకంబులు ♦ విరివిగాఁ బెరుఁగవా?
యీస్వర్గదేశమం ♦ దెల్ల యెడల
దండిగా ధాన్యముల్ ♦ పండుచునుండవా?
యీస్వర్గదేశమం ♦ దెల్ల యెడల
పండులువృక్షాల ♦ నిండఫలింపవా?
యీస్వర్గదేశమం ♦ దెల్ల యెడల

పాలుసమృద్ధిగాఁ ♦ బశువులుపిదకవా?
యీస్వర్గదేశమం ♦ దెల్లయెడల

గీ. ఇన్ని యీశ్వరుఁడొసఁగినన్ ♦ దృప్తిఁగొనక
కనికరముమాని మాంసమున్ ♦ దినఁగవానె?
పాపమున నింతపంతంబు ♦ పాడియగునె?
మిత్రవరులార! యీశ్వర ♦ పుత్త్రిలార! 2

సీ. జన్మములనుపేర ♦ జంతువులనుజంపి
పండితుల్ చేసిరి ♦ పాపములను
జాతరలనుపేర ♦ జంతువులనుజంపి
పామరుల్ చేసిరి ♦ పాపములను
ఆహారమనిచంపి ♦ యన్నిజంతువులను
బ్రాజ్ఞులేచేసిరి ♦ పాపములను
సకలమాబాధలు ♦ జంతువులకునిడి
పలువురుచేసిరి ♦ పాపములను

గీ. జంతువులఁగూర్చి యక్కటా! ♦ జాలిగొనెడు
వారలరుదైరి హింసయు ♦ పారమయ్యె
పాపమున నింతపంతంబు ♦ పాడియగునె?
మిత్రవరులార! యీశ్వర ♦ పుత్త్రిలార! 3

సీ. పసులపై మనదయన్ ♦ బ్రసరింపఁజేసిన
విరివిగావర్షముల్ ♦ గురియఁగలవు

పసులపై మనదయఁ ♦ బ్రసరింపఁజేసినఁ
పంటలుదండిగాఁ ♦ బండఁగలవు
పసులపై మనదయఁ ♦ బ్రసరింపఁజేసినఁ
బాడిసమృద్ధిగాఁ ♦ బరఁగఁగలదు
పసులపై మనదయఁ ♦ బ్రసరింపఁజేసిన
నాయురారోగ్యమ్ము ♦ లబ్బఁగలవు

గీ. పసులపై నెంతమనదయ ♦ పర్వునంత
యీశ్వరునిదయమనపయి ♦ నెసఁగఁగలదు
పశువులనుగావమనకుశు ♦ భంబుగలదు
మిత్రవరులార! యీశ్వర ♦ పుత్త్రులార!

సీ. ధనికులమనువారు ♦ దండిగానున్నారు
పశువులమొఱవిను ♦ వారులేరు
భక్తులమనువారు ♦ పలువురున్నారలు
పశువులమొఱవిను ♦ వారులేరు
వీరులమనువారు ♦ వేనవేలున్నారు
పశువులమొఱవిను ♦ వారులేరు
గురువులమనువారు ♦ కోటులున్నారలు
పశువులమొఱవిను ♦ వారులేరు

గీ. దీనపశువులమొఱవిన ♦ లేనివారు
ఎన్నిబిరుదులవారైన ♦ నేమిఫలము
ఈశ్వరా! నీవెపసుల ర ♦ క్షింపవలయు
నీవెయందఱమదిదయ ♦ నింపవలయు.

జిల్లా కాంగ్రెసు సంఘము కర్నూలు జిల్లా.



శ్రీ మహాత్మ గాంధి

# గాంధిమహాత్ముఁడు.

---

(అమెరికాదేశపుఁ గన్యారత్నమగు అంజలామార్గన్ దేవిగా
ఆంగ్ల గీతము ననుసరించి రచింపఁబడిన గీతమాలిక.)

---

వందిమాగధపాఠక ♦ ప్రతతిలేదు
తనువుపైఁగవచాదులు ♦ దాల్పలేదు
భాంకృతులతోడ ముందేగు ♦ భటులులేరు
చెలఁగు భేరీరవముతోడి ♦ సేనలేదు

ఎన్నఁడు కిరీటముధరించి ♦ యెఱుఁగఁడితఁడు
ఆయుధముఁబట్టి యెఱుఁగఁడు ♦ హస్తమందు
ఇతనియశమను రవిపుట్టి ♦ యిప్పుడిపుడె
వెలుఁగుచున్నాఁడు తనదగు ♦ నెలవునందు
క్రమముగ స్వజాతిజయమును ♦ గాంచుకొలఁది
ఈ రవియుఁగూడఁ దనరాజ్య ♦ మేలఁగలఁడు
ప్రీతితో నెన్నఁడేనియు ♦ నూతనముగ
ధర్మము విశేషరూపముఁ ♦ దాల్చినీకుఁ
దోఁపఁగనిదాని సామాన్య ♦ రూపములను
స్వాంతమున లెక్కసేయని ♦ వాఁడవేని,

ఎన్నఁడైనను రాత్రిమే ♦ ల్కొన్నవేళఁ
బరహితపు దివ్యచింత నీ ♦ భావమందుఁ
బ్రజ్వరిలఁగాంచి పొంగిన ♦ వాఁడవేని,
కష్టములమీఁదఁ గష్టముల్ ♦ గలిగనేని
దీనినెరవేర్చితీరెద ♦ దీనికొఱకె
నన్నుఁబుట్టించెఁ బ్రభువని ♦ యెన్నఁడేని
ప్రబలబలమాత్మ కొసఁగిన ♦ వాఁడవేని
ఎఱుఁగఁగలవీవు గాంధి దా ♦ నెట్టివాఁడొ.
ఆర్యమహిమాస్వరూపమ ♦ హర్షియితఁడు
అతులశాంతాత్ముఁడైన మ ♦ హాత్ముఁడితఁడు
దేహముఁ దాల్చినట్టి ప్ర ♦ తిజ్ఞయితఁడు
భీతియేమొ యెఱుంగని ♦ వీరుఁడితఁడు
ఎట్టిబాధకు లొంగని ♦ దిట్టయితఁడు
దారిఁజూపంగ నేర్చిన ♦ తారయితఁడు
ఎప్పుడైనను నెటనైన ♦ నీశ్వరుండు
వ్యక్తమగునను సత్యముఁ ♦ వ్యక్తపఱుప
నవనిపైఁబుట్టియున్నట్టి ♦ వ్యక్తియితఁడు
మాయలోఁబడియుండుసా ♦ మాన్యులైన
మర్త్యులకగోచరంబయి ♦ మానముగను
బ్రచలితంబయి స్వర్గసా ♦ మ్రాజ్యమందు

శాశ్వతంబుగ నొప్పారు ♦ శాసనమును
స్పష్టతరముగఁ దనదివ్య ♦ దృష్టిఁగాంచి
అన్నివిధముల దానితో ♦ నైక్యమంది
అంతమెఱుఁగని దానిలో ♦ నరయఁదొడఁగె
స్వీయమానవజాతికిఁ ♦ స్థిరముగాను
న్యాయమొనరింపఁగలుగు మ ♦ హాపథమును
అతుల సద్గుణకంధి మ ♦ హాత్మ గాంధి 4

---

చూడు మనపయి వెలిఁగియు ♦ సూర్యకరణి
శుద్ధమతితోడ మనలను ♦ నుద్ధరింప
మహికి నెట్టులు వంగెనో ♦ మనుజుసరణి
మనుజుఁ బ్రేమించి దేవుఁడో ♦ మనుజుఁడనుచు
నేను నీవును నమ్మెడు ♦ దానికిపుడు
ప్రబల దృష్టాంతరూపమై ♦ పరఁగినాఁడు
అతుల సద్గుణ కంధి మ ♦ హాత్మగాంధి. ౫

# కులీనుఁడు

అనఁగా సత్కులమునందుఁబుట్టినవాఁడు ఎవఁడు?

అతనికులమును గూర్చినే ♦ నడుగఁబోను
అతనిపేరునుగూర్చినే ♦ నడుగఁబోను
మానవోచితశీలముఁ ♦ బూనియున్న
నాతఁడెకులీనుఁడిలను య ♦ థార్థముగను
మించునిహసంపదలఁబట్టి ♦ యెంచిచూడ,
గొప్పవాఁడైననేమి? యాతనిఁ ♦ గొనియాడుచున్
నతనిమది కేవల దయార్ద్రి ♦ మైనయదియె?
యనుచునడిగిన యపుడు నీ ♦ వవునటంచు
గట్టిగా నీవుచెప్పంగఁ ♦ గలిగితేని
నాతఁడెకులీనుఁడిలను య ♦ థార్థముగను
అతఁడుపుట్టిన దేశ మే ♦ దైననేమి?
అతఁడుపెరిగిన దేశ మే ♦ దైననేమి?
అమల చారిత్రుఁడయియున్న ♦ నదియెచాలు
నాతఁడెకులీనుఁడిలను య ♦ థార్థముగను
ప్రవిమలంబుగ నొప్పారి ♦ పాటెనేని
నెచటఁబుట్టిననేమి యా ♦ యేఁటిచెపుమ
అతఁడు జన్మంబుగాంచిన ♦ దంతిపురమొ
యాకుటిల్లాయటంచు ని ♦ న్నడుగఁబోను
అతఁడు విశ్వాసపాత్రుఁడా ♦ యనుచునిన్ను
నడుగనౌనని చెప్పిన ♦ నదియెచాలు
నాతఁడెకులీనుఁడిలను య ♦ థార్థముగను.

# యతిగీతము.

(శ్రీవివేకానందస్వామిగారి ఆంగ్లగీతమున ననుసరించి
రచింపఁబడిన గీతమాలిక)

ఎత్తిపాడుము కంఠము ♦ నెత్తిపాడు
యతివరా! ధీర! ఓంతత్స ♦ దనుచుఁబాడు

పుట్టెనీగీతమతిదూర ♦ భూమియందు
విషయవాసన కందని ♦ విషయమందు
కామధనకీర్తి కాంక్షలఁ ♦ గలఁతగానని
శాంతిమయకందరారణ్య ♦ చయమునందు
చారుతరసచ్చిదానంద ♦ పూరమందు
ఎత్తిపాడుము కంఠము ♦ నెత్తిపాడు
యతివరా! ధీర! ఓంతత్స ♦ దనుచుఁబాడు

పట్టిత్రెంపుము త్రెంపునీ ♦ బంధనముల
మించుబంగారువే కాని ♦ మించకుండు
నినుపవే కాని మఱియవి ♦ యేవిగాని
పట్టిత్రెంపుము త్రెంపునీ ♦ బంధనముల
ద్వంద్వములు మంచిచెడ్డలున్ ♦ బంధనములె
వైరరాగాదులునుగూడ ♦ బంధనములె

గానఁ దెగఁదు్రింపవలయును ♦ వీనిఁగూడ
కొట్టఁబడినను బ్రేమచేఁ ♦ జుట్టఁబడిన

దాస్యమెట్లుండిననుగూడ ♦ దాస్యమెకద
కట్టఁజాలదె గొలుసు బం ♦ గారుదైనఁ

గాన వేగమె తెగఁద్రెంచి ♦ వీని నెల్ల
యతివరా! ధీర! ఓంతత్స ♦ దనుచుఁబాడు

---

మినుకు మినుకని చీఁకటిఁ ♦ మీఁదమీఁద
నలముచుండెడు కొఱవిద ♦ య్యంబుపగిదిఁ

దనరునజ్ఞానమును బాపి ♦ కొనుము వేగ
జననమరణమ్ములకులాగి ♦ కొనుచునేగు

జీవితపుఁ దృష్ణ నార్పుము ♦ శీఘ్రముగను
తన్నుఁదాగెల్చు నేని వాఁ ♦ డన్ని గెల్చు

దీనిఁదెలియుము లొంగకు ♦ దేనికింక
యతివరా! ధీర! ఓంతత్స ♦ దనుచుఁబాడు.

అవనిఁజల్లిన దెద్దియో ♦ యదియెపండుఁ
గారణమ్మునుబట్టియే ♦ కార్యముండుఁ

జెడ్డచెడ్డకుమంచి మం చికినిగలుగు
దీనిఁదప్పించుకొనుటకుఁ ♦ దెరవులేదు
రూపుతో బంధనంబుండు ♦ రూఢముగను

అన్నిటిని మీఱియున్నది ♦ యాత్మగాన
నాత్మకనురూప నామధే ♦ యములులేవు
అదియెనీవను సత్యంబు ♦ మదినెఱింగి
యతివరా! ధీర. ఓంతత్స ♦ దనుచుఁబాడు

తల్లియని తండ్రియని మఱి ♦ పిల్లలనుచు
భార్యయని మిత్రమని మఱి ♦ బంధువనుచుఁ
గలవరించెడువారలు ♦ దెలియలేరు
సత్యమేదియొ మఱియు న ♦ సత్యమెదియొ
ఆత్మకాలేదు స్త్రీపురు ♦ షాదిభేద
మెవనికిండండ్రి మఱియాతఁ ♦ డెవనిబిడ్డ
యెవనిశత్రువు మఱియాతఁ ♦ డెవనిసఖుఁడు
ఒక్కటే యాత్మయంతట ♦ నొప్పుచుండు
అంతయును నాత్మకాని య ♦ న్యంబులేదు
అదియె నీవనుసత్యంబు ♦ మదినెఱింగి
యతివరా! ధీర! ఓంతత్స ♦ దనుచుఁబాడు

ఉండునదియెల్లఁ దానయై ♦ యొక్కఁడుండు
నాతఁడే జ్ఞాత ముక్తుండు ♦ నాత్మయతఁడె
ఆతనికిరూప నామధే ♦ యములులేవు
ఆతనికి దోషమింతయు ♦ నంటకుండు
నతనిలోనొక్కమాయ దా నలరుచుండుఁ

10

గలలనెన్నియొ యద్దియే ♦ కనుచునుండుఁ
గాని యాయాత్మసాక్షియై ♦ కాంచుచుండు
నదియెనీవను సత్యంబు ♦ మది నెఱింగి
యతివరా! ధీర! ఓంతత్స ♦ దనుచుఁబాడు

ముజ్జగంబీయఁజాలని ♦ ముక్తికొఱకు
నెచట వెదకెదు? మిత్రమా ♦ యెట వెదకెదు?
గ్రంథముల గుళ్ళ వెదకినఁ ♦ గలదెఫలము?
నిన్నుదాలాగి కొనిపోవు ♦ చున్నత్రాడు
నీకరమునందె యున్నది ♦ నిజముగాను;
వగచుటనుమాని నీవింక ♦ వదలిదాని
యతివరా! ధీర! ఓంతత్స ♦ దనుచుఁబాడు

ఎట్టిప్రాణియునానుండి ♦ యించుకైనఁ
బడయకుండునుగాక య ♦ పాయమెపుడు
పైవసించెడు మఱిక్రిందఁ ♦ బ్రాకుచుండు
నన్నిప్రాణులకును నాత్మ ♦ యయినవాఁడ
ఇహపరంబుల జీవిత ♦ మెడలినాఁడ
స్వర్గనరకాశభయముల ♦ వదలినాఁడ
ననుచు నీబంధనంబుల ♦ నట్టెత్రెంచి
శాంతిపారమొసంగుచు ♦ సర్వమునకు
యతివరా! ధీర! ఓంతత్స ♦ దనుచుఁబాడ

కాయమేమైనలక్ష్యమ్ము ♦ సేయఁబోకు
దానిపనిదీరెఁ గావున ♦ దానిఁబట్టి
కొట్టుకొనిపోని కర్మమే ♦ గట్టుకేని
దానికగునట్టి మండన ♦ దండనముల
నించుకేనియు నెంచకు ♦ మేమియనకు
పొగడఁబడువాఁడు మఱియును ♦ బొగడువాఁడు
తిట్టఁబడువాఁడుమఱియును ♦ దిట్టువాఁడు
నొక్కఁడై యుండ స్తుతినింద ♦ లున్నచెపుమ
స్వాంతమున నివ్విధంబున ♦ శాంతినించి,
యతివరా! ధీర! ఓంతత్స ♦ దనుచుఁబాడు

---

కామమును మోహలోభముల్ ♦ గలుగుచోట
నుండునే సత్యమెన్నఁడు ♦ నుండఁబోదు
ఇంతినిఁ దనపత్నిగా ♦ నెన్నునట్టి
పురుషుఁడెన్నఁడు పూర్ణతఁ ♦ బొందలేఁడు
తనదనుచునెంత చిన్నదేఁ ♦ దలఁచువాఁడు
ఆగ్రహగుణంబుచే బద్ధుఁ ♦ డైనవాఁడు
తథ్యముగమాయగుమ్మమ్ము ♦ దాఁటలేఁడు
గాననీదుర్గుణమ్ముల ♦ మానివేసి
యతివరా! ధీర! ఓంతత్స ♦ దనుచుఁబాడు

---

నీకునిల్లేల? నినుఁబట్టు ♦ నిలయమున్నె?
గడ్డియెపరుండుపాన్పు ఆ ♦ కసమెకప్పు

చిక్కిన దెతిండిమంచి దేది ♦ చెడ్డ దేని
మంచిచెడ్డలమదిలోన ♦ నెంచబోకు
తన్నుఁదెలిసిన మహాత్మ ♦ కెన్నఁడేని
నమరునెకళంకమన్న పా ♦ నములచేత?
పాలునేలుగ నెప్పుడు ♦ బరఁగుచుండి
యతివరా! ధీర! ఓంతత్స ♦ దనుచుఁబాడు

---

కొంద ఱేసత్యమెఱుఁగుచు ♦ నుందురిలను
గానఁదక్కినవారలు ♦ ఘనుఁడ నిన్నుఁ
జేరినవ్విన లక్ష్యమ్ము ♦ సేయఁబోకు
ముక్తుఁడా యెల్లకడలకుఁ ♦ బోయిపోయి
మోదమునకయి వెదకక ♦ ఖేదమునకు
భయపడకయుండి రెంటిని ♦ వదలిచనుచు
మాయ తెఱఁ దీసి జనులత ♦ మమ్ముఁబాపి
యతివరా! ధీర! ఓంతత్స ♦ దనుచుఁబాడు

---

సర్వకర్మఫలంబులు ♦ సమయువఱకు
ననుదినంబివ్విధంబునఁ ♦ జనుచునుండి
నీవు నీయాత్మఁ గోసఁగుము ♦ నిత్యముక్తి;
అప్పుడుండదు నీవు నే ♦ ననుటగాని
జననమును దేవమానవు ♦ లనుటగాని
ఆత్మపరమాత్మలకు భేద ♦ మనుటగాని
అదియె యానందమును మఱి ♦ యదియెనీవు,
యతివరా! ధీర! ఓంతత్స ♦ దనుచుఁబాడు




శ్రీ రాజా రామమోహనరాయలు

# శ్రీ రాజారామ మోహనరాయలు

---

. శ్రీలరంజిల్లగాఁ ♦ జేయనీ దేశముఁ
బూనెను శ్రీరామ ♦ మోహనుండు
జనులనువిద్యావి ♦ శారదులను జేయఁ
బూనెను శ్రీరామ ♦ మోహనుండు
అతిదురాచారమ్ము ♦ లంతరింపఁగఁ జేయఁ
బూనెను శ్రీరామ ♦ మోహనుండు
పరమేశ్వనిభక్తిఁ ♦ బ్రజలలోఁ బురికొల్పఁ
బూనెను శ్రీరామ ♦ మోహనుండు

క. పూతచరితుండు శ్రీరామ ♦ మోహనుండ
పుణ్యనిలయుండు శ్రీరామ ♦ మోహనుండు
పూర్ణభక్తుండు శ్రీరామ ♦ మోహనుండు
భువినినసముండు శ్రీరామ ♦ మోహనుండు

సీ. అతనికారణమున ♦ నతిఘోరతరములౌ
సహగమనంబులు ♦ శాంతినొందె
అతనికారణమున ♦ నమలస్వాతంత్ర్యేచ్ఛ
యందఱిలోపల ♦ నంకురించె
అతనికారణమున ♦ నార్యవిజ్ఞానంబు
పరదేశములయందుఁ ♦ బర్వఁజొచ్చె
అతనికారణమున ♦ నాంగ్లభాషాభ్యాస
మీభూమిలోపల ♦ నెలమిఁగాంచె

## శ్రీరాజా రామమోహనరాయలు.

గీ. ఆతఁడజ్ఞానతిమిరసీ ♦ హారకరుఁడు
ఆతఁడార్తులపాలికి ♦ నాప్తవరుఁడు
అతఁడు దేశాభిమానుల ♦ కమరగురుఁడు
అతఁడుభక్తాళికెల్ల ప్ర ♦ హ్లాదసముఁడు

సీ. తల్లిదండ్రులనైనఁ దావీడెనేకాని
విశ్వేశునాజ్ఞను ♦ వీడలేదు
పరదేశమైనఁబో ♦ వంగనొప్పెనుగాని
యుచితకార్యమువీడ ♦ నొప్పలేదు
ఒరులుతిట్టిననైన ♦ నోర్చియుండెనుగాని
యురుదుష్కృతులనోర్చి ♦ యుండలేదు
ఆత్మసౌఖ్యమునైనఁ ♦ ద్యజియించెనేకాని
హితకృత్యమును ద్యజి ♦ యింపలేదు

గీ. అట్టిధన్యుఁడు రామమో ♦ హనుఁడుఘనుఁడు
సుజనసమ్మతమతమును ♦ జూపినాఁడు
దేశమునకునుగీ:ర్తిని ♦ దెచ్చినాఁడు
జన్మమననిట్టివానిదే ♦ జన్మముగద!

# శ్రీ మహర్షిస్వామి దయానంద సరస్వతి.

---

సీ॥ బాలురుం బాలికల్ ♦ బ్రహ్మచర్యముఁబూని
వివిధవిద్యలనేర్చి ♦ వెలయుఁడనియె
ప్రౌఢావివాహముఁ ♦ బరిపాటికిందెచ్చి
మంచిసంతతిఁగాంచి ♦ మించుఁడనియె
అభిరుచిగలవృత్తు ♦ లందుఁ బ్రవేశించి
న్యాయార్జనముచేత ♦ నలరుఁడనియె
సకలమతంబులఁ ♦ జక్కఁగాఁబరికించి
పూతమౌధర్మముఁ ♦ బూనుఁడనియె

గీ. భుక్తినొసఁగెడుదేశముఁ ♦ ముక్తినొసఁగు
దైవమును భక్తిఁగొలుచుచుఁ ♦ దనరుఁడనియె
ఇదియెవైదికధర్మమై ♦ యెసఁగుననియె
ఆదయానందయోగి ధ ♦ ర్మానురాగి.

సీ. పరమేశ్వరునిమది ♦ భక్తినర్చించుటే
బ్రహ్మయజ్ఞంబని ♦ పలికినాఁడు
ఓషధీతతులచే ♦ హోమమొనర్చుటే
దేవయజ్ఞంబని ♦ తెలిపినాఁడు
తల్లిదండ్రులను స ♦ ద్భక్తిసేవించుటే
పితృయజ్ఞమని నిరూ ♦ పించినాఁడు
అతిథులైనట్టి మ ♦ హాత్ములఁ గొల్చుటే
నరయజ్ఞమని తేట ♦ పఱచినాఁడు

గీ॥ తనవలెనె సర్వజీవులఁ ♦ దలఁచిహితము
సలుపుచుండుటె భూతయ ♦ జ్ఞంబటంచుఁ
జాటినాఁడు భవాబ్ధిని ♦ దాఁటినాఁడు
ఆదయానందయోగి ధ ♦ ర్మానురాగి. 2

సీ॥ బలవీర్యములచేతఁ ♦ బ్రబలంగవలెనన్న
బాల్యవివాహముల్ ♦ వదలుఁడనియె
భగవంతు గుణములఁ ♦ బడయంగవలెనన్న
విగ్రహారాధన ♦ విడువుఁడనియె
ప్రేమచే హృదయంబు ♦ వికసింపవలెనన్న
మద్యమాంసములను ♦ మానుఁడనియె
విద్వేషములుమాని ♦ వెలయంగవలెనన్న
మూఢవిశ్వాసముల్ ♦ వీడుఁడనియె

గీ॥ స్వర్గరాజ్యంబు భూమిపై ♦ వలయుననిన
దురితకార్యంబులందుండి ♦ తొలఁగుఁడనియె
మానవాళిహితమ్మునే ♦ మదిదలంచి
ఆదయానందయోగి ధ ♦ ర్మానురాగి

సీ॥ ధాత్రినెచ్చటనున్న ♦ ధర్మాత్ములందఱు
నార్యనామమునకు ♦ నర్హులనియె
ఎల్లరీశ్వరునకుఁ బిల్ల ♦ లమైయుంట
ధరణినందఱము సో ♦ దరులమనియె
స్త్రీలుమహోన్నత ♦ స్థితిని వర్ధిల్లుచే
దేశసౌభాగ్యముల్ ♦ దెలుపుననియె

ఆయురారోగ్యమ్ము ♦ లమరఁజేసెడునట్టి
సత్కార్యమునె సదా ♦ చారమనియె

గీ॥ సత్యముఁ న్యాయముఁ దయా ♦ శౌచములను
దాల్చి మెలఁగుచునుండుటే ♦ ధర్మమనియె
పరులకపకృతిసేయుటే ♦ పాపమనియె
ఆదయానందయోగి ధ ♦ ర్మానురాగి.

సీ॥ పరితపించుచునుండు ♦ బాలవితంతుల
పాలికిఁదండ్రియై ♦ పరఁగినాఁడు
తల్లిదండ్రులులేని ♦ పిల్లలపాలికిఁ
బ్రియమైనమాతయై ♦ వెలసినాఁడు
చదువెఱుంగని నిమ్న ♦ జాతులపాలికి
నెంతయుగురువయి ♦ యెసఁగినాఁడు
ప్రాణిముల్గోల్పోవు ♦ పశుపులపాలికి
నాప్తబాంధవుఁడయి ♦ యలరినాఁడు

గీ. సర్వతోముఖవృద్ధికి ♦ సర్వజనుల
మేలుకోర్వెడు మిత్రుఁడై ♦ మెలఁగినాఁడు
పావనంబగు చిత్ర జీ ♦ వనమువాఁడు
ఆదయానందయోగి ధ ♦ ర్మానురాగి.

శ్రీమహర్షి స్వామి దయానందసరస్వతి.

సీ. లోపముల్ చూపినఁ ♦ లోకులు పైఁబడి
కొట్టితిట్టిననోర్చు ♦ కొన్నవాఁడు
సత్యమన్వేషింప ♦ సంచారమొనరించి
పడరానికడగండ్ల ♦ పడినవాఁడు
ఉన్నతస్థితిఁబాసి ♦ యున్నదేశముఁజూచి
కన్నులందడివెట్టు ♦ కొన్నవాఁడు
మనదురాచారముల్ ♦ మాన్పంగసమకట్టి
కడవఱకునుబాటు ♦ పడినవాఁడు

గీ. విషముఁబెట్టినఁగూడను ♦ విడువకుండ
ధర్మమార్గానువర్తియై ♦ తనరుచుండి
శాంతముగ ప్రాణమునువీడి ♦ చన్నవాఁడు
ఆదయానందయోగి ధ ♦ ర్మానురాగి.

# ప్రాతః ప్రార్థన

గీ. మఱచినిద్రించుచుండిన ♦ తరుణమందు
పరమపిత. నీదుకరుణ కా ♦ పాడెనన్నుఁ
గానఁబ్రాభాతసమయంపుఁ ♦ గాన్కగాగ.
నతినుతులనిత్తుఁగైకొమ్మ ♦ నాథనాథ
నూతనోత్సాహభరితుఁడ ♦ నై తనర్చి
నేటికర్తవ్యములఁజొచ్చి ♦ నెగడుటకును
దగినబలమిచ్చునదినీదు ♦ దయయెకాన
వందనమొనర్చుచున్నాఁడ ♦ భక్తితోడ
అంతటననంతమహిమతో ♦ నలరుచుండి
సూటిగామాకునెప్పుడు ♦ చూపుచుండు
నీదుకరుణాదిసద్గుణ ♦ నిచయములను
జగతిలోవస్తుతతియెల్లఁ ♦ జాటుచుండ
నీశ్వరా! యెంచియెవఁడు వ ♦ ర్ణింపఁగలఁడు?
పనులనొనరింప సుఖముల ♦ ననుభవింప
నేఁడు నేఁబోవుటకుముందు ♦ నిన్నె నాకు
నెమ్మదినిపూర్ణ నేతగా ♦ నమ్మువాఁడ
ఎల్ల దేహాత్మబలము ల ♦ ర్పించువాఁడ
శోధనలఁజిక్కి నేఁడు నే ♦ సోలకుండ
బలముతోఁబోర సంసిద్ధ ♦ పఱుపుమయ్య
బుద్ధిచెప్పుచు నామది ♦ దిద్దుమయ్య
హృదయమునునీదు ప్రేమచేఁ ♦ బాదుగుమయ్య
విమలుఁడవునీవు నాదారి ♦ వెలుఁగుమయ్య

చెడుతలంబుల సవరణ ♦ సేయుమయ్యా
లోకవాంఛల నెల్లను ♦ లోంచుమయ్యా
నాదుకోర్కులఁదలఁపుల ♦ నాథనిన్నుఁ
జేరుగతిఁ బావనములుగఁ ♦ జేయుమయ్యా
వివిధరీతులనుండునా ♦ విధుల నెల్లఁ
దఱినిదగురీతి నెఱవేర్పఁ ♦ గఱపుమయ్యా
అన్ని కార్యములందునా ♦ యంతరాత్మ
యించుకయుఁగూడఁ జెడకుండ ♦ నుంచుమయ్యా
నాకునీయందునుండెడు ♦ నమ్మకమ్ము
కదలక పరీక్షలకు నిల్చి ♦ క్రాలుఁగాక
అవని నేఁగాంచు వృద్ధిక్ష ♦ యంబులంద
విడక దృఢభక్తి నిన్ను సే ♦ వింతుఁగాక
ఈశ! నినుఁబొందుటయె జీవి ♦ తాశయముగ
నిరతము దలంచుచుండంగ ♦ నేర్తుఁగాక
దినదినమమూల్యదినముగాఁ ♦ దెలిసి యిట్లు
యుక్తరీతిని గడపుచు ♦ నుందుఁగాక
భక్తియందును నిర్మల ♦ భావమందు
ననుదినంబును వర్ధిల్లి ♦ యంతకంత
నినుసమీపించు భాగ్యంబు ♦ గనుదుఁగాక
శాశ్వతానందదాయక! ♦ సర్వజనక!

# సాయం ప్రార్థనం

గీ. నీదరిని జేరి పరమాత్మ ♦ నేటిదినము
వివిధరీతులనాపయి ♦ విరివిగాను
నీవుగురిపినసుఖముల ♦ నెమ్మిఁదలఁచి
వందన మొనర్చుచున్నాఁడ ♦ భక్తితోడ.
అనుభవించినయట్టినా ♦ హర్షములును
గొల్లగాఁబండినట్టినా ♦ కోరికెలును
ఒప్పుగాఁబీల్చినట్టినా ♦ యూపిరులును
స్పష్టముగనీదుకరుణను ♦ ప్రకటపఱచి
పరమపురుష! కృతజ్ఞతా ♦ బద్ధునిగను
సలిపెఁగావునమత్కరా ♦ బ్జములమోడ్చి.
వందన మొనర్చుచున్నాఁడ ♦ భక్తితోడ
విడక నేఁడెల్లనావెను ♦ వెంటనుండి
కాయమునుమానసంబును ♦ గాచినావు
పుత్త్రవాత్సల్యమునుజూపి ♦ ప్రోచినావు
సత్కృతులుసేయనవకాశ ♦ సాధనములఁ
గూర్చివానినిమతినెఱ ♦ వేర్చుటకును
నాకుఁదగినబలంబిచ్చి ♦ నావుగాన
వందన మొనర్చుచున్నాఁడ ♦ భక్తితోడ
సర్వవిదుఁడవు నేఁడునే ♦ సలిపినట్టి
సర్వపాతకములును స్ప ♦ ష్టమ్ము నీకు
నీదునాజ్ఞలనెఱవేర్చ ♦ నియతియందు
నెంతనాలోపమున్నదో ♦ యెఱుకనీకుఁ

గానఁబరితాపభరమునఁ ♦ గందికుంది
నన్నురక్షింపుమని వేఁడు ♦ చున్నవాఁడ
అర్హమౌశిక్షచేతనా ♦ యాత్మనిపుడు
విమలముగఁజేయు మనివిన్న ♦ వించువాఁడ
పాపజాలమ్ములోమఱి ♦ పడకయుండ
దృఢమతిందయసేయఁ బ్రా ♦ ర్థించువాఁడ
నీదుసాయము లేకున్న ♦ నిజముగాను
నిలిచిశోధనలను నేను ♦ గెలువ లేను
గానఁగరుణాసముద్ర నా ♦ మానసమునఁ
బూర్ణ విశ్వాసబలములఁ ♦ బొందుపఱిచి
పాపవిముఖుఁడనై నేను ♦ బరఁగుటకును
సర్వవిధముల చేతను ♦ సాయపడుము
దేవ నాజీవితములోని ♦ దినములింక
విడక నీయిచ్చఁబట్టియే ♦ కడవనిమ్ము
స్వామి! నీయందుఁబూర్ణ వి ♦ శ్వాసముంచి
హాయిగానింక నిద్రబో ♦ నాజ్ఞయిమ్ము
లేవఁగలిగిన మిగిలిన ♦ జీవితమును
వేడ్కమీఱఁగనీకు న ♦ ర్పింపనిమ్ము
కానియీరాత్రి కడపటి ♦ దేనినన్ను
ననుపమానంతసీమ మే ♦ ల్కొనఁగనిమ్ము
నీదయాపక్షముల నెక్కి ♦ నిరుపమాన
నిర్మలానందమందిర ♦ నిచయములను
జేరిశాశ్వతసుఖమునఁ ♦ జెలఁగనిమ్ము
సకలలోకైకనాయకా! ♦ సర్వజనక.

# ప్రార్థన.

---

దేవ! నీదయభువిని నా ♦ జీవితమ్ము
దివ్యతరమగు నొకచిన్న ♦ దీపమగుచు
నెచట నేనున్న నచ్చట ♦ నెలమితోడ
విమలతరమైనకాంతితో ♦ వెలుఁగుఁగాత.
దేవ నీదయభువిని నా ♦ జీవితమ్ము
సహజమైనట్టి తనవికా ♦ సమునఁబొదలి
ముదమునొదవించు నొకచిన్న ♦ పుష్పమగుచు
నల్పమౌతన నెలవున ♦ నలరుఁగాత
దేవ! నీదయభువిని నా ♦ జీవితమ్ము
దైన్యమును బాపిపరులకు ♦ ధైర్యమొసఁగి
పాటకానిని సంతోష ♦ పఱచునట్టి
చిన్నయొకగీతరత్నమై ♦ చెలఁగుఁగాత
దేవ! నీదయభువిని నా ♦ జీవితమ్ము
శక్తికోలఁదిని బరులకు ♦ సాయమిడుచు
నబలులకునెల్లనాదరు ♦ వైనచిన్న
యూతగఱ్ఱగసతతంబు ♦ నొప్పుఁగాత
దేవనీదయభువిని నా ♦ జీవితమ్ము
వింతగొల్పెడు నీకార్య ♦ వితతికలరి
పొంగిపొరలెడుభక్తితోఁ ♦ బొగడుచుండు
నందమౌచిన్నకీర్తన ♦ యగునుగాత.

## ప్రార్థన.

దేవ! నీదయభువిన్ని నా ♦ జీవితమ్ము
నవ్యభవదీయ మణిభూష ♦ ణమ్మునందు
నమరితనచోట నగకెల్ల ♦ నందమిచ్చు
చిన్నము త్తెంపుఁబూసనై ♦ చెలఁగుగాత

ఉ. పాపము లెల్లఁబోఁదోలఁచి ♦ భావములోఁ బరిశుద్ధభక్తియన్
దీపము వెల్గఁజేసి భవ ♦ దీయదయామృతవృష్టిచేత నా
తాపము లెల్లనార్చినను ♦ ధన్యుని జేయు మటంచు వేఁడి నీ
ప్రాపును జేరినాఁడను గృ ♦ పాగుణభూషణా! భక్తపోషణా!

# ఉద్బోధనం

చిమ్మచీఁకటి నీత్రోవఁ ♦ గ్రమ్మియున్న
ధైర్యమెదఁగొమ్ము సోదరా! ♦ తడఁబడకుము
దారిదీనులకును జూపు ♦ తారగలదు
దైవమును నమ్మిచేయుము ♦ ధర్మమెపుడు

తెరువుకడుభీకరంబైన ♦ దీర్ఘమైనఁ
గన్నులకగోచరంబుగ ♦ గమ్యమున్న
భయపడకపొమ్ము బలమున్న ♦ బడలియున్న
దైవమును నమ్మిచేయుము ♦ ధర్మమెపుడు

మాయమర్మములెల్లను ♦ మడియనిమ్ము
వెలుఁగునకు జంకునవియెల్లఁ ♦ బొలియనిమ్ము
కలిమిలేములనేదైనఁ ♦ గలుగనిమ్ము
దైవమును నమ్మిచేయుము ♦ ధర్మమెపుడు

ఎగసిపోనిమ్ము దుశ్చింత ♦ లెట్టివైన
దయ్యములు దేవతలరూపు ♦ దాల్చెఁగాన
సరకుసేయకుపైమతా ♦ చారములను
దైవమును నమ్మిచేయుము ♦ ధర్మమెపుడు

ద్వేషమునఁగాంత్రు కొందఱు ♦ ప్రేమఁగాంత్రు
పొగడుచుందురు కొందఱు ♦ దెగడుచుంద్రు
మానిమనుజుని నాపయి ♦ వానిఁగనుము
దైవమును నమ్మిచేయుము ♦ ధర్మమెపుడు

సరళశాసన దాతయు ♦ సత్యనేత
లోనిశాంతియు నిగనిగ ♦ లీనుజ్యోతి
యైనయొకతారనీదారి ♦ నధివసించు
దైవమును నమ్మిచేయుము ♦ ధర్మమెపుడు

# వందనములు.

గీ. సృష్టియొనరించియున్నావు ♦ శ్రీకరముగ
పాలనము సేయుచున్నావు ♦ భాసురముగ
నంత మొనరింపఁగలవు మ ♦ హాద్భుతముగ
ప్రభువతంసమ ఇవిగో నా ♦ వందనములు.

---

ప్రాణదాతవు నేతవై ♦ పరఁగినావు
ప్రాణమునకును ప్రాణమై ♦ పరఁగినావు
ప్రాణమునకంటెఁ బ్రియుఁడవై ♦ పరఁగినావు
ప్రాణనాయక! ఇవిగో నా ♦ వందనములు

---

దుఃఖములచేత హృదయమున్ ♦ దున్నిదున్ని
పరమకరుణామృతమ్మును ♦ గురిపి కురిపి
మించు సద్గుణములను బం ♦ డించునట్టి
పరమపావన! ఇవిగో నా ♦ వందనంబులు

---

కన్నులారంగ మనములఁ ♦ గనుచునుండి
వీనులారంగ మనవుల ♦ వినుచునుండి
యంతటను నిండి యాత్మకు ♦ నాత్మవగుచుఁ
బరఁగు పరమాత్మ! ఇవిగో నా ♦ వందనములు.

---

నీదు మహిమలఁ గనుఁగొని ♦ నిన్నుఁ బొగడఁ
బరులకుపకార మొనరించు ♦ పనులు సేయ
నచ్చెరువుగొల్పు నరదేహ ♦ మిచ్చినావు
పరమపిత! హిత! ఇవిగో నా ♦ వందనములు

గర్భమునజీవకోటులఁ ♦ గరుణఁదాల్చి
కావలసినట్టివెల్లను ♦ గరుణనొసఁగి
బుద్ధులనునేర్పి కరుణతో ♦ నుద్ధరించు
పరమజననిరో! ఇవిగో నా ♦ వందనములు.

---

దివ్యదృశ్యంబులెల్లను ♦ దెఱచిచూపి
జ్ఞానమనుజ్యోతిచేతను ♦ మానసమును
వెలుఁగగాఁజేసిలోవెలి ♦ వెలుఁగుచుండు
పరమగురువర! ఇవిగో నా ♦ వందనములు.

---

గుట్టులనురట్టుసేయక ♦ కూర్మితోడ
వింతగాఁజింతలనుబాపి ♦ సంతసమిడి
వీడకెప్పుడువెనువెంట ♦ వేచియుండు
పరమమిత్రమ! ఇవిగో నా ♦ వందనములు.

## హారతి.

### చంపకము.

గగనవిశాలపాత్రమునఁ ♦ గ్రాలగజ్యోతులుచంద్రభాస్కరుల్
సొగసుగ ముత్తెముల్పగిది ♦ శోభిలఁజుక్కలుకమ్మతెమ్మెరల్
నెగడగఁజామరమ్ములుగ ♦ నిండుగవిచ్చిన పూలుచెట్లలో
నిగనిగలీనశక్తజయ ♦ నిస్వనభేరులు మ్రోయఁగా సదా
యగణితవైఖరిం జెలఁగు ♦ హారతినీకుఁ త్రిలోకనాయకా!